# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక



# విషయానుక్రమణిక

## 27 డిశంబరు 1950

---

**వ్యాసాలు:**



**కథలు:**



**నాటిక:**



**సినీమా:**



**బొమ్మరిల్లు:**



**గేయం:**





## 27 డిశంబరు 1950

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder: K. NAGESWARA RAO

సంపుటము 43
సంచిక 16

వికృతి సంవత్సర మార్గశిర బహుళ తదియ బుధవారము



బొంబైలో వివిధరాష్ట్ర ఆహారమంత్రుల సమావేశం 'ఎత్తుగడ' భేషుగ్గా ఉన్నదని వార్త. —శంకర్స్ వీక్లీ

# ఆహార సమస్య

## అందరూ "కంకరే"

బొంబాయిలో 22 మంది ఆహార మంత్రులూ సమావేశం అయినారు. ఇంటికి తిరిగి వచ్చారు. సమావేశం అద్భుతంగా ప్రారంభమయింది, అద్భుతంగా సాగింది, అద్భుతంగా ముగిసింది. ఒక్క అపశ్రుతి లేకుండా అందరు ఆహారమంత్రులూ ఏకగ్రీవప్రకటన చేశారు. "ఆహారసమస్యా, ఎక్కడున్నావే?" అంటే "ఉన్నచోటే ఉన్నా"నంటున్నది.

దేశం క్లిష్ట పరిస్థితిలో ఉండి, జనం తిండి లేక అలమటిస్తున్న తరుణంలో అన్ని రాష్ట్రాల ఆహారమంత్రులూ "కంకర్" అయిచేసిన ప్రకటన ఏమిటి?

"నాలుగురాష్ట్రాల్లో తప్ప దేశమంతటా తీవ్ర ఆహారసమస్య ఏర్పడి ఉన్నది.

"వచ్చే ఏడు 37 లక్షల టన్నుల ఆహారం దిగుమతి చేసుకోవటానికి ప్రభుత్వం అభ్యంతరం చెప్పదు. అయితే ప్రపంచ పరిస్థితి విషమించితే ఇది క్లిష్టం కావచ్చు.

"ఆహారధాన్యాల కంట్రోలు ఉంటుంది. ధరలకంట్రోలు సాధ్యమైనంతవరకు అమలు జరిపేదే.

"పరిస్థితి తీవ్రంగా ఉన్నా విషమించలేదు. ప్రజలు ఎంతమాత్రమూ ఆందోళన చెందరాదు.

"ప్రజలూ, పత్రికలూ ప్రభుత్వంతో సహకరించాలి."

## అసలు విషయం మినహా

ఈ ఆహారమంత్రులంతా సమకూడినది గ్రామసీమల రేషనింగులో ఏర్పడిన దుస్థితిని గురించి చర్చించి ఒక నిర్దిష్టవిధానం అవలంబించటానికి. ముఖ్యంగా మద్రాసు, బీహారు బొంబాయి రాష్ట్రాలలోని ప్రభుత్వాలకు ధాన్యం అందలేదు. గ్రామాలలో రేషనులు లభించకపోవటం జరిగింది.

ఆహారమంత్రుల సమావేశంలో ఈ సమస్య చర్చకు రావటమే గాక తీవ్రమైన ఘర్షణకూడా జరిగినట్టు తెలుస్తున్నది. కనుక చిట్టచివరకు జరిగిన ప్రకటన ఏకగ్రీవంగా జరిగిందంటే చర్చలో జరిగిన తర్జన భర్జనలపై రాష్ట్ర ఆహారమంత్రులకూ, కేంద్ర ఆహారమంత్రికీ రాజీ కుదిరిందన్నమాట. ఈ ఆహార మంత్రుల సమావేశం సాధించిన "విజయం" ఇదే లాగ కనిపిస్తుంది!

సమావేశాంతాన ప్రకటించబడిన నివేదికలో గ్రామసీమల రేషనింగు గురించి ఏ నిర్ణయం జరిగినట్టూ లేదు. అంటే రాష్ట్ర ప్రభుత్వాలు గ్రామాల రేషనింగు కొనసాగించలేకపోతే నిక్షేపంగా మానుకోవచ్చునని నిర్ణయం జరిగిందన్నమాట. ఇంకేం? మద్రాసు రాష్ట్రం గ్రామాల రేషనింగు గురించి చేతులు కడిగేసుకుంది. తరుగు జిల్లాలలో ధాన్య సేకరణకూడా ఉండదు. మిగులు ప్రాంతాలలో ధాన్య సేకరణా, నగరాలలో రేషనింగూ ఉంటుంది. ఈ పరిస్థితులు తిండి దొంగలైన వ్యాపారస్తులకు అనుకూలమైనవనటానికి సందేహం లేదు. తిండిగింజలు అందించే హామీ ప్రభుత్వం ఇవ్వక, తాము సంపాదించుకోలేని పరిస్థితి ఏర్పడితే పేదగ్రామీణులు ఆహారమంత్రుల సలహాపాటించి ఎంతవరకు ఆందోళన చెందకుండా ఉంటారో చూడవలిసి ఉన్నది.

ఆహారమంత్రులు చేసిన నిర్ణయాలు ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధంగా ఉన్నవనీ, బాధ్యతగల ప్రజామంత్రులు చేయదగినవి కావనీ విమర్శలు వెలువడ్డాయి, అయితే ఈ సమావేశం తమను ఉద్ధరిస్తుందని ప్రజలు అనుకోలేదు. ప్రభుత్వంవిసుగులేకుండా, సహకరించమని ప్రజలను ఎన్నిసార్లడిగినప్పటికీ, ప్రభుత్వంతో తాము ఏవిధంగాసహకరించాలో, తమ సహకారంతో ప్రభుత్వం ఏ గొప్ప పనులు చేయనున్నదో ప్రజలు తెలుసుకోలేని స్థితిలో ఉన్నారు. పైకి కనిపిస్తున్నదల్లా ప్రభుత్వం ప్రజలబాధ్యతలనుండి సాధ్యమైనంతవరకు తప్పుకుంటూ ఉండటమే.



రైల్వేబోర్డు సభ్యులకు, భారత రిపబ్లిక్ అధ్యక్షులు డాక్టర్ రాజేంద్రప్రసాద్ విందు.

## విచిత్ర విధానం

మనదేశంలో ఆహార కొరత ఎప్పుడూ ఉండనే ఉన్నది. దేశంలోని పంట దేశవాసుల కెన్నడూ సరిపోనే లేదు. బర్మా, సయాం మొదలైన దేశాలు మనకు బియ్యం సప్లయి చేస్తూ ఉండేవి. యుద్ధకాలంలో ఈ సప్లయిలు నిలిచిపోయాయి. బెంగాలు క్షామం 35 లక్షలమందిని పొట్టన పెట్టుకున్నది.

తిరిగి బర్మా మొదలైన దేశాలతో వాణిజ్యం సాగిన తరవాత బియ్యం సంపాదించే మార్గాలు ఏర్పడ్డాయి. సింహళం బర్మానుంచి దండిగా బియ్యం కొన్నది. దానితో పోలిస్తే ఇండియా చాలా కొద్ది మొత్తాలే కొన్నది. ఇదేమిటని బర్మావాళ్లుకూడా అన్నారు. ఇండియాప్రభుత్వం బర్మా బియ్యాన్ని తగినంతగా దిగుమతి చేసుకోనట్టే కనిపిస్తుంది.

ఈ మధ్యనే చైనా ఇండియాకు బియ్యం ఇచ్చి, ఏ ధరకైనాసరే గోతాలు కొంటామన్నట్టున్నూ, ఇండియాప్రభుత్వం ఈ బేరానికి ఒప్పుకోనట్టూ తెలుస్తున్నది. కొంతకాలం క్రితం రష్యాకూడా ఇండియాకు ఆహారధాన్యాలు అమ్మజూపింది.

ఇండియా ప్రభుత్వంలో గోధుమలే దిగుమతి చేసుకోదగిన ఆహారధాన్య మైనప్పటికీ బియ్యం దిగుమతులు అవసరం. అచ్చగా బియ్యం తినేవారికి ప్రస్తుతం బలవంతంగా అంటగట్టే గోధుమలు, గోధుమలు తినేవారికి మిగులుతాయి.

కరువులు మన దేశానికి కొత్తకాదు. మన వ్యవసాయం పంటకాలువలమీదకన్న వానదేవుడిపైనే ఆధారపడి ఉన్నది. అతివృష్టి అనావృష్టి దోషాలవల్ల దేశంలో ఏటా క్షామానికి గురిఅయే ప్రాంతాలూ, వరదలకు గురిఅయే ప్రాంతాలూ కూడా లేకపోలేదు. మనదేశంలో అమలులోఉన్న భూమి అమరకం విధానమూ, వ్యవసాయ పద్ధతులూ పూర్తిగామారి, నీటి సౌకర్యాలు ఎన్నోరెట్లు అభివృద్ధి చెందితేనేగాని అధికాహారోత్పత్తి తలపెట్టటానికైనా లేదు. 1952 మార్చి ఆఖరులోగాగాని, మరొక గడువులోగాగాని ఆహార స్వయంసమృద్ధి చేకూరాలంటే ప్రభుత్వం అవలంబించవలసిన విధానానికీ, ప్రస్తుతం ప్రభుత్వం అవలంబిస్తున్న విధానానికీ ఎక్కడా పొంతన లేదు.

## ఏది ఆహారలోటు?

దేశంలో పండే పంటకూ, దేశం యొక్క ఆహారావసరాలకూ గల వ్యత్యాసం తెలుసుకున్నట్టయితే దేశం యొక్క ఆహారకొరత తెలుస్తుంది. కాని ఈ వివరాలు ఎవరికీ తెలియవు. ప్రస్తుతం ఆహారకొరత అని అంచనాకట్టి దిగుమతి చేస్తున్న ఆహార ప్రమాణం ఏమంటే, ప్రభుత్వం ధాన్యసేకరణ ద్వారా సంపాదించే మొత్తానికీ, రేషనింగుద్వారా ప్రజలకు అందించవలసిఉన్న మొత్తానికీ గల తేడా మాత్రమే. ఏనాడు ధాన్యసేకరణా, రేషనింగు అవసరాలూ ఒకదానికొకటి సరిపోతాయో ఆనాడు ఆహారస్వయంసమృద్ధి దేశానికి చేకూరినట్టే !

ఈ దృష్ట్యా గ్రామసీమలరేషనింగు ఎత్తివేయటం స్వయం సమృద్ధికి ఒక ముందడుగు. 1952 మార్చి ఆఖరుకు ప్రభుత్వం అన్ని చోట్లా రేషనింగు ఎత్తివేసి కొన్ని చోట్లమాత్రం ధాన్యసేకరణ జరిపినట్లయితే, ఒక్క గింజ అదనంగా పండించకుండానే, దేశం మిగులు దేశంకూడా అయికూర్చుంటుంది! అయితే ప్రభుత్వం అచ్చగా ఈ లెక్కలనే నమ్ముకోక ఇతర లెక్కలుకూడా తయారుచేశారు. రైతులకు ఋణాలిచ్చీ, ఎరువులిచ్చీ, కొత్తభూమిని సాగుకిందికి తెచ్చీ ఇందువల్ల వచ్చే అదనపు పంటను గురించి కూడా అంచనావేశారు. కాని ఈ పై పూతలవల్ల అణుమాత్రమైనా ఆహారోత్పత్తి పెరిగినట్టు దాఖలాలేదు.

రైతు అప్పులపాలై ఉన్నాడు, వాడికి గొడ్లులేవు, పొలంమీద హక్కులేదు. వాడికీ గొడ్లకూ తిండిలేదు. భూభజన యంత్ర వ్యవసాయానికి అనువైనదికాదు. నీటిసౌకర్యాలు లేవు. వానమీద ఆధారపడక తప్పేదిలేదు. ఈ పరిస్థితులలో ప్రభుత్వం అధికాహారోత్పత్తి ప్రణాళికలు అమలుచేసి విఫలం కావటంలో ఆశ్చర్యంలేదు. తీవ్రమైన భూ సంస్కరణలతోబాటు రైతుకు ప్రభుత్వ సహాయంఉంటేగాని ఈదేశానికి ఆహారస్వయం సమృద్ధిఉండదు.

## ఆహారం ధర

గ్రామాలలో రేషనింగు ఎత్తివేయటంతో ఆహార ధాన్యాల ధర పెరిగితీరుతుంది. దొంగమార్కెటువ్యాపారం బజారులోకి రావటంవల్ల కొద్దిమంది ధనికులు చాటుగా ఇస్తున్న ధరలు తగ్గవచ్చు. కాని రేషను ధరలమీద తప్పనిసరిగా ఉంటుంది. అందుచేతనే ఆహారమంత్రులు "సాధ్యమైనంతవరకు" ఆహారధరలు కంట్రోలు చేస్తామన్నారు. ప్రభుత్వం యొక్క సామర్థ్యం చూస్తే వారి సాధ్యాసాధ్యాలకు పరిమితులు ఏవో ఊహించటం సాధ్యం కాకుండా ఉంది.

దీనికితోడు ఇండియా ప్రభుత్వంవారు ఆహార సబ్సిడీలు నిలుపుచేయబోతున్నారు. అందుచేత ఆహారధాన్యాల ధరలు ఎటూ పెరగనే పెరుగుతాయి. రేషనుగా లభించే ధాన్యాల ధరలే పెరుగుతాయి. వర్తకులవద్ద దొరికే ధాన్యాలమాట వేరే చెప్పనవసరంలేదు.

## పలాయన మంత్రం

బొంబాయిలో సమావేశమైన ఆహారమంత్రులు పఠించినది కేవలం పలాయనమంత్రాలే. ప్రజలూ, పత్రికలూ ప్రభుత్వంతో సహకరించాలనటంలో అర్థం, ఆహారసమస్య క్లిష్టంగా ఉండటానికి ప్రజల, పత్రికల సహాయం తక్కువకావటమేనని. ప్రభుత్వ మంత్రులు తమ విధానాలను విమర్శించుకోవటం మాని ప్రజలనూ, పత్రికలనూ, అనావృష్టినీ సాకుగా చెబుతున్నారు.

ప్రస్తుతంఉన్న ఆహార తీవ్రపరిస్థితి యావత్తూ దైవికంగా ఏర్పడ్డదికాదు. ధాన్యసేకరణ విధానంలో జరుగుతున్న లోపాలూ అవినీతీ, అక్రమాలూ ప్రజ లెరిగినవే. బహు భాషాప్రాంతాలుగల రాష్ట్రాలలో ప్రభుత్వమే పక్షపాతం వహించి తరుగు ప్రాంతాలకోసం మిగులు ప్రాంతాలను తరుగు ప్రాంతాలుగా చెయ్యటంకూడా జరిగింది. ధాన్యసేకరణ సవ్యంగా జరిగితేనే పరిస్థితి కొంతవరకు చక్కబడి రేషనింగు ఇంత భీభత్సం కాకపోవచ్చు. ధాన్యం దాచేవారిపట్ల ప్రభుత్వం, సమ్మెలుచేసే ప్రదర్శనాలుచేసే కార్మికులపట్లా, విద్యార్థులపట్లా తీసుకుంటున్నపాటిచర్య తీసుకున్నట్టయితే రేషనింగు ఇంతఅధ్వాన్నంగా ఉండకపోను. ఆహారం విషయంలో యుద్ధకాలన్నైఖరి అవలంబిస్తానని ప్రభుత్వం బెదిరించింది. ఆహారం విషయంలో తీవ్రపరిస్థితి ప్రకటించి, కేంద్రమే కొన్ని చట్టాలుతయారు చేసి, ఆకలి సహనం తప్పని సరిఅయే పక్షాన ఆ సహనం ఉన్నవారూ, లేనివారూ కూడా అవలంబించేటట్టు చూడవచ్చు. "వారాని కొకరోజు పస్తుండండి. కొద్ది ఆహారంతోనే తృప్తిపడండి. ఆకులూ అలములూ తినండి. గడ్డి భోంచేయటం మంచిది," అని ధర్మపన్నాలు చెప్పటం నగుబాట్లపాలు కావటానికేగాని పరిస్థితి మారటానికి ఉపయోగపడదు. తినగలవాళ్లు వారానికి పదిరోజులు తింటున్నారు. లేనివారు ఏడురోజులూ పస్తుంటున్నారు. ఇవాళ భారతీయులు భోంచేసే ఆహార పదార్థాలలో ఆకులూ, అలములూ, గడ్డి లేకనూ పోలేదు.

—రావు.

నేటిప్రపంచం:

# యుద్ధమూ, శాంతీ

## రెండు ముఖాలు

ఇటీవల ఐక్యరాజ్య సభ్యులు అంతర్జాతీయ రంగంలో ఒక వింత గమనించారు. అదేమిటంటే ఒకవంక కొరియా యుద్ధవిరమణకూ, మరొకవంక, యూరపు సైనికసమీకరణకూ జరిగే ప్రయత్నాలు ఒకే కాలమందు చురుకెక్క సాగాయి.

దూరప్రాచ్యంలో యుద్ధం జరగటం పశ్చిమ రాజ్యాలలో ఏ ఒక్కదానికీ ఇష్టం లేదు. కొరియాలో ఇటీవల మకార్థర్ చూపిన "యుద్ధనైపుణ్యం" ఫలితాలు చూసిన తరవాత అమెరికాకుకూడా దూరప్రాచ్యంమీద అందని ద్రాక్షపళ్లు పులుపన్న విరక్తి కలిగినట్టే కనిపిస్తున్నది. ఉత్తర దక్షిణ కొరియాల సంఘర్షణలో దక్షిణకొరియా కాళ్లు బారజాచిందని తెలియగానే భద్రతామండలిఆమోదాన్నికూడా పొందకుండా కొరియామీద "దురాక్రమణ" నేరం మోపి విరుచుకుపడ్డ అమెరికా, నెహ్రూప్రభృతుల శాంతిసలహాలను తృణీకరించి 38 వ అక్షాంశరేఖను దాటి ఉత్తరకొరియా ప్రవేశించిన అమెరికా, ఇప్పుడు చైనా కొరియాలో దురాక్రమణ చేసిందని ఆరోపణ చేస్తూకూడా, ఆ దురాక్రమణయొక్క విషాదఫలితాలు అనుభవిస్తూకూడా మంచూరియా సరిహద్దుమీద విరుచుకుపడ సాహసించలేదు. పైపెచ్చు కొరియా యుద్ధవిరమణకు ఐక్యరాజ్యసమితిద్వారా యత్నాలు జరగనిస్తున్నది.

అమెరికాకు యుద్ధమంటే భయమని కాదు, చైనాఅంటే భయమనీ కాదు. అట్లా అయినపక్షంలో అమెరికాలో తీవ్ర పరిస్థితి ప్రకటించి, మారణాస్త్రాలకొరకు కోటానకోట్లు మంజూరుచేసి, యూరపు సైన్యాలను సమీకరించటానికి అమెరికా మొదలైన "ప్రజాస్వామిక" దేశాలు చేసే చర్యలకు అర్థంలేదు. సామ్రాజ్యవాదపితామహుడు చర్చిల్ సూత్రప్రాయంగా చెప్పిన ముక్క - "మన లక్ష్యం దూరప్రాచ్యం కాదు, యూరపు" - అందరూ ఆమోదించారు.

దూరప్రాచ్యంలో ప్రపంచయుద్ధం సాగిస్తే రెండు చిక్కులున్నాయి: ఒకటి, కొరియాలోలాగే చైనాలోకూడా అమెరికను సైనికులే ప్రధానంగా ఆహుతి కావలిసివస్తుంది. "నిద్రించే" చైనా "భూతాన్ని" రెచ్చగొట్టటం బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. దూరప్రాచ్యంలోనూ ఆగ్నేయాసియాలోనూ ఈ దేశాలకింకా కొంత పరపతి ఉన్నది. మలయాలో బ్రిటనూ ఇండోచైనాలో ఫ్రాన్సూ యుద్ధాలు సాగిస్తున్నప్పటికీ అవి చాలా పరిమితమైన యుద్ధాలు - వ్యాపారదృష్టికి భంగం రాకుండా చేస్తున్నవి. ఉదాహరణకు మలయాలో బ్రిటను సైనికచర్యలకింద ఏడాదికి సుమారు 2 లక్షల పౌనులు ఖర్చుపెడుతున్నది. మలయా రబ్బరుమీద ఏడాదికి 2 కోట్ల పౌనులు ఆర్జిస్తున్నది. 2 కోట్లపౌనుల రాబడికొరకు 2 లక్షలపౌనుల ఖర్చుబడి చెయ్యటం వ్యాపారదృష్ట్యా సమంజసమే. బ్రిటను హాంకాంగువలసకూడా రాబడి ఇస్తున్నది. అదీకాక బ్రిటనుకు చైనాలోనే చాలా సొత్తున్నది. ఫ్రాన్సు తన యుద్ధఖర్చు అమెరికాచేత పెట్టుబడి పెట్టిస్తూ ఇండోచైనాముడిపదార్థాలమీది లాభాలను తానే పుచ్చుకొంటున్నది. అందుచేత ఈదేశాలు సాగించే యుద్ధాలు కేవలం వ్యాపారయుద్ధాలనవచ్చు.

అమెరికా దూరప్రాచ్యంలో అమెరికా చిచ్చుపెట్టినట్టయితే ఈ వ్యాపారం మట్టికొట్టుకుపోవటమే కాకుండా, తటస్థంగానూ లాభసాటిగానూ ఉన్న ఇండియా, బర్మా, సయాం మొదలైన దేశాలలో ఎటువంటి పరిణామాలు కలుగుతాయో చెప్పవీలు లేదు.

ఇంకొక చిక్కేమిటంటే దూరప్రాచ్యం



వాషింగ్టన్‌లోని భారతరాయబారకార్యాలయంలో, ఇటీవల, మద్రాసు వాస్తవ్యురాలు జయా అప్పాస్వామికన్య తమ చిత్రాలను ప్రదర్శించారు. (చిత్రంలో ఎడమనుంచి నాలుగవవారు.)

యుద్ధరంగమైతే ముడిపదార్థాల ఆధారాలు మూలపడతాయి. అప్పుడు యూరపులో జరగవలసిన “అసలు” యుద్ధకాండకు ఆధారం ఉండదు.

## చైనా వైఖరి

అందుచేత ఐక్యరాజ్యసమితివారు కొరియాయుద్ధ విరమణ తీర్మానం చేశారు. యుద్ధవిరమణ కమిషనుసభ్యులు, ఈ తీర్మానంలో మోసం ఏమీ లేదని చైనాకు నచ్చజెప్పటానికి ప్రయత్నించారు. కాని చైనా ఈ తీర్మానాన్ని తోసివేసింది. చైనా ప్రధాని చౌ ఎన్‌లాయ్ చేసిన వ్యాఖ్యానం : “ఈ తీర్మానంలో చైనా పాల్గొనలేదు. అందుచేత ఇది క్రమవిరుద్ధం. ఇది అచ్చగా కొరియా సమస్య కాదు. ఇది ఆసియా సమస్య. ఫార్మోజా మొదలైన ఇతర సమస్యలతో నే ఇది పరిష్కారం కావాలి.”

## రాజకీయ సమితి పక్షపాతం

నిజానికి ఐక్యరాజ్యసమితి చైనా, అమెరికాలమధ్య చాలా పక్షపాతం ప్రదర్శించి ఉన్నది. రాజకీయసమితిలో చైనా దురాక్రమణగురించి అమెరికా చేసిన ఆరోపణా, అమెరికా దురాక్రమణగురించి కమ్యూనిస్టుఆరోపణా చర్చించవలసిఉండగా, అమెరికా తెచ్చిన ఆరోపణగురించి మాత్రమే చర్చజరిగి కమ్యూనిస్టుఆరోపణపై చర్చ ఎంతకూ జరగలేదు. డిసెంబరు ఆరంభంలోనే విషిన్‌స్కీ అమెరికాపై ఆరోపణలు ప్రకటించాడు. ఒకరోజు గడువిస్తే ఆ ఆరోపణలకు సమాధానం చెబుతానని అమెరికా ప్రతినిధి డలెస్ అన్నాడు. కాని 19 వ తేదీన చైనారాయబారవర్గం వెళ్ళిపోయేదాకా అమెరికాసమాధానాలు తెలియనే లేదు.

## బ్రసెల్స్ సమావేశం

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో చేరిన 12 దేశాల విదేశాంగ, రక్షణ శాఖామంత్రులు గత 18 వ తేదీన సమావేశమై సమైక్య పశ్చిమ యూరపు సేన ఏర్పరచటానికీ, అందులో జర్మనుబలాలను చేర్చటానికీ నిశ్చయించారు. ఈ రాజ్యాల రక్షణకు తాను తోడ్పడతానని అమెరికా ప్రమాణం చేసింది.

ఈ సమావేశం జరక్కపూర్వమే రష్యా, బ్రిటను ఫ్రాన్సులకు హెచ్చరికలు పంపుతూ, ఆ దేశాలు తనతో చేసుకున్న స్నేహఒడంబడికలకు భంగం జరుగుతున్నదని ఆరోపించింది. జర్మనీ సాయుధం కావటం రష్యాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. పూర్వం జరిగిన అగ్రరాజ్యఒడంబడికలకు ఈ యోస్తు వ్యతిరేకంగా ఉన్నదని రష్యా వాదించగల స్థితిలో ఉన్నది.

ఏమైనా బ్రసెల్సు సమావేశం వెనువెంటనే పశ్చిమ యూరప్ రక్షణబలాలకు జనరల్ ఐసెన్‌హోవర్ అగ్రనాయకుడుగా నియమించబడటం కూడా జరిగింది.

బ్రసెల్సునిర్ణయంవల్ల, మూడేళ్ళ క్రితం బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియం, నెదర్లాండ్సు, లక్సెంబర్గులమధ్య జరిగిన ఒడంబడికా, పశ్చిమయూరపురక్షణసంస్థా కూడా రద్దు అవుతున్నట్టే.

“అట్లాంటిక్ సేనలు” రక్షించే ప్రాంతాన్ని మూడు మండలాలుగా విభజిస్తారనీ, అందులో మెడిటరేనియన్ ప్రాంతానికి సేనానిగా ఉండేవాడు కామన్వెల్తు అజమాయిషీకింద ఉంటాడనీ తెలుస్తున్నది.

## నెహ్రూ నిర్వహించదగిన పాత్ర

ఈ విధంగా అమెరికా చేసే యుద్ధసన్నాహాలు కాలక్రమాన నార్వేకొసనుంచి మధ్యప్రాచ్యంవరకూ గల ప్రాంతాన్ని యుద్ధజ్వాలలలో ముంచవచ్చు. ఇందులో కామన్వెల్తుదేశాలుకూడా చిక్కుకోవచ్చు. ఈ రక్షణవిధానం నిజంగా అమలుజరిగే పక్షాన ఇండియా విదేశాంగవిధానం దీని, విరుద్ధంగా ఉండకతప్పదు. అందుచేత జనవరి 4 న లండనులో ప్రారంభంకానున్న కామన్వెల్తుప్రధానుల సమావేశంలో రక్షణగురించీ, ఆయుధధారణగురించీ జరగబోయే చర్చలలో నెహ్రూ వహించే పాత్రకు చాలా ప్రాముఖ్యం ఉంటుంది. ముఖ్యంగా, కామన్వెల్తులో చేరిఉన్న పశ్చిమ దేశాలకూ తూర్పుదేశాలకూ గల వ్యత్యాసాలు ఇందులో బయటపడవచ్చు. —రావు.





ఈమధ్య ఉన్నట్టుండి హఠాత్తుగా నేపాల్ బాబా అనే ఆయన ప్రసిద్ధుడయ్యాడు ఆయన ఎలాంటి రోగాన్నయినా ఇట్టే కుదిర్చేస్తున్నాడని కర్ణాకర్ణిగా విని వేలకొద్దీ జనం ఒరిస్సాలోని రంతలాయ్ గ్రామానికి మూగటం ప్రారంభించారు ఆయన వచ్చినవాళ్ళందరికీ 'సర్వరోగనివారిణి' అనే పేరుతో ఏదో చెట్టుబెరడును ఇవ్వటం మొదలెట్టాడు దాని వల్ల ఒక్క జబ్బయినా నయమైనట్టు దాఖలాలు లేవు కాని మరే కారణంవల్లనో మొదట్లో ఎవరికి జబ్బో కుదిరివుంటుందనీ, దాన్ని నేపాల్ బాబా మహిమగా ప్రజలు వసంతులు పాకించివుంటారనీ మనం నిస్సందేహంగా ఆరోపించవచ్చు

*  *  *

భారతదేశం ఆధ్యాత్మికభూమి అని బహుకాలంగా ఒక వాదం ప్రచారంలో వుంది ఈవిషయంమీద భారతీయులకే నమ్మకం సన్నగిల్లుతున్న రోజుల్లో తెల్లవాళ్లు వచ్చి దానికి మళ్లీ జీవంపోశారు విదేశీయుల్లో బాగా మేధావులైనవాళ్లుకూడా 'వేదాలు' ఉపనిషత్తులు, బూజుపుట్టిన ఇతర పాత సాహిత్యం తిరగేసి ఈవాదం నిజమే నన్నారు మనదేశంలోని భౌతికసంపదనంతా దోచుకుపోతూ "ప్రపంచానికి ఇండియా ఇవ్వవలసిం దేమన్నా వుంటే అది ఆధ్యాత్మికసందేశమొక్కటే" నని బాజా వాయించారు కామమ్మ మొగుడంటే కామోసుననుకున్నట్టు మనవాళ్లు ఈ వాదాన్ని నమ్మేశారు

మతవిశ్వాసానికి మానవుడిలోని భయమే ఆధారం అనాగరికదశలో వున్నప్పుడు మనిషి ప్రకృతిశక్తుల్ని చూసి భయపడి మానసికంగా తను లొంగిపోతే అవి తమ్ము కరుణిస్తాయనీ, మంత్రాలచేతా, తంత్రాలచేతా వాటిని వశపరుచుకోవచ్చునీ నమ్మాడు కాని మానవుడి ఇచ్ఛాశక్తి లేకుండానే జీవితపు అవసరాలవల్ల నాగరికత పెరిగింది నాగరికత పెరిగి పదార్థవిజ్ఞానం ఎక్కువైనకొద్దీ ప్రకృతి వెనకగల దైవత్వంమీద నమ్మకం తగ్గిపోతున్నది

*  *  *

భారతదేశంలో నూటికి 99 మంది దేవుణ్ణి గాఢంగా విశ్వసించటంవల్ల మనదేశానికి ఆధ్యాత్మికభూమి అనే 'అపవాదు' వచ్చింది మన ఆధ్యాత్మికవాదుల్లో చాలా రకాలవారు వున్నారు

భగవాన్ రమణమహర్షివలె "నినురనువ్వు తెలుసుకోవటమే జీవితానికి ప్ర

(46-వ పేజీ చూడండి)




నందకిశోరరావు చోడవరం మన్నెంలోస్కూళ్ల డిప్యూటీ ఇనస్పెక్టరుగా పనిచేస్తున్నాడు. రేంజియొక్క హెడ్‌క్వార్టర్సు ఏలేశ్వరం. ఇనస్పెక్టరుతో పరిచయమున్న సింహాద్రిరావు, స్వస్థలమైన కాకినాడనుంచి బయలుదేరి, స్నేహితుడైన నందకిశోరరావు ఊరిలో లేక కమానువెళ్లగా "ఇంటిదగ్గిరనుంచి బయలుదేరినవేళ మంచిది కాదు" అనుకొన్నాడు. ఇనస్పెక్టరు కమానునుంచి ఎప్పుడు వస్తాడో తెలియదు! మిత్రుడితో సరదాగా కాలక్షేపం చేదామని అతను వచ్చాడు. కాని మిత్రుడు లేకపోగా ఏమీ తోచలేదు. సరదాకోసం వచ్చినవాడు తిరిగి ఊరికే వెళతాడా? ఇంటిదగ్గర తొందర పనులేమి ఉన్నాయని! అతను ఆలోచన చేశాడు. "స్నేహితుడు ఊళ్ళో లేకపోడమే బాగుంది. ఇప్పుడు రెండు కలిసివస్తాయి. నేను వెళ్లి అతనిని కమానులోనే కలుసుకుంటాను. ఇంటిదగ్గిరకన్న కమానులో అయితే మరింత కులాసాగా కాలక్షేపమవుతుంది. నాకు లోకానుభవం పూర్తిగా ఉంది. కాని ఆ శ్రీరామాదుల కున్న వనవాసానుభవం లేదు. ఇప్పుడు కాకపోతే మరి అడివిని చూడడ మెప్పుడు కలిసివస్తుంది? ఈ అదను పోగొట్టుకొంటానా! ఎంతమాట! వెళ్లి అతను ఏ ఊళ్ళో ఉంటే ఆ ఊళ్ళో కలుసుకొంటాను. మా మిత్రుడు కూడా ఎంతో ఆనందిస్తాడు. అతనికి తిరుగుడులో ఉండే బాధ తొలగిపోతుంది" అని.

అతను డిప్యూటీ ఇనస్పెక్టరుఆఫీసుకి వెళ్లి ఆ తేదికి ఇనస్పెక్టరు ఏ ఊళ్ళో ఉండవచ్చో కనుక్కున్నాడు. పైగా, అక్కడికి వచ్చిన ఉపాధ్యాయులనుంచి కొంత భోగట్టా లాగాడు. శరభాపురంలో ఉండవచ్చని తెలుసుకొని సాహసించి అక్కడికి వెళ్లదలచాడు. మన్నెంలో ఊళ్లు తిరగడమంటే

తమాషా కాదు. ఆ వైపు మన్యాని కంతకి ఒకే ఒక కంకరరోడ్డు ఉంది. ఆ దారిని బస్సుకూడా వెళ్లుతుంది. బళ్ళదారులు లేని ఊళ్లుకూడా ఉన్నాయి. గాజుల తట్లు అంటే గుర్రాలమీద వెళ్లవలసిన ఊళ్లూ ఉన్నాయి. కాలినడకకి కూడా గతి లేని ఊళ్లూ ఉన్నాయి. సింహాద్రిరావు ఇంకో గంటలో, అంటే మధ్యాహ్నం బయలుదేరే బస్సులో, వెళ్లదలుచుకొన్నాడు. కాఫీ హోటెలులో కాస్త కతికి, బస్సుస్టాండుకి వచ్చాడు. అప్పటి కింకా బస్సు రాలేదు. కాలక్షేపానికి కిళ్లీ నములుతూ, సిగరెట్టు పీలుస్తున్నాడు.

సింహాద్రిరావు సన్నగా ఎర్రగా ఉంటాడు. పాతిక ఏళ్లు. కళ్లు పెద్దవి. మధ్య మధ్య బిత్తరచూపులు చూస్తూంటాడు. కొంచెం నవ్వుమొహం. సన్నని మీసం. చిన్న పిలక ఉందికాని బయట పెట్టడు. ముందు క్రాపింగు. దేశీయదిరీసు వేసుకొన్నాడు. కాస్త షోకు జమాయిద్దామని రంగు వెలసిపోయిన కోటు ఒకటి ధరించాడు.

బస్సు వచ్చింది. సింహాద్రిరావు ముందు సీటులో చొరవచేసి కూర్చున్నాడు. బస్సు నడక సాగించగా కాస్త నోరున్నవాడు కాబట్టి దారిలో బస్సు ఎక్కిన ప్రతివాడిని కూడ 'డిప్యూటీ ఇనస్పెక్టరుగారు ఎక్కడ మకాంచేశారు. ఏమిటి కథ అని కనుక్కొంటూ సాయంత్రానికి శరభాపురం చేరుకొన్నాడు.

అతని అంచనా చక్కగా ఫలించింది. లేకపోతే పాపం ఈ అడివిలో ఎక్కడెక్కడ తిరగవలసివచ్చేదో, ఏమి గతో! ఇనస్పెక్టరు శరభాపురంలోనే ఉన్నాడని విని నేను కొంత పుణ్యం చేసుకొన్నాను" అని సంతోషించాడు.

నందకిశోరరావు బడి పరీక్ష చేసుకొన్నాడు. కుర్చీమీద కూర్చున్నాడు. సింహాద్రిరావుని చూసీ చూడడంతోనే ఇనస్పెకరు ఆశ్చర్యపోయాడు. "నువ్వ అసిస్టెంటు ఏజెంటు తాతలాగున్నావే!" అన్నాడు.

"నేను పాతికేళ్ళవాణ్ణి, తాత నెల్లాగు అవుతానయ్యా!" అన్నాడు సింహాద్రిరావు.

"అరి నీతస్సల మందు! మేము మన్నెంలో ఎక్కడ ఉన్నాసరే" అసిస్టెంటు ఏజెంటు ఇట్టే పట్టేస్తాడు. నలుగురిని నాలుగు మూలలా పంపిస్తాడు. వల వేస్తే పిట్ట దొరికినట్టు దొరికిపోతాం. నువ్వా మనిషివంటే! ఈ అడివేమిటి! ఈ మన్నెమేమిటి! ఈకొండ లేమిటి! ఇక్కడి తిండి తిప్ప లేమిటి!" అంటూండగా సింహాద్రిరావుకూడా అందుకొని "ఇక్కడి దారు లేమిటి! ఇక్కడి మనుష్యు లేమిటి! ఇక్కడి ఆఫీసర్లేమిటి!" అన్నాడు.

"నువ్వు బాగా కుదిరేవు లేరా!" అన్నాడు ఇనస్పెక్టరు.

"నేను పిలవకుండానే వచ్చానుగా!" అన్నాడు సింహాద్రిరావు.

పిలవకుండా వచ్చినవాళ్ళే ఇక్కడికి కావాలి. మన్నెం అంటే మజాకా అనుకొంటున్నావేమో! ఇక్కడివాళ్లే వాడిలిపోతారు. రాజబాటని పోతూంటేనే ఏ పెద్దపులి మీద పడుతుందో, ఏ ఎలుగుగొడ్డు తరుముతుందో అని! సరే! మాటలు తర్వాత కానిద్దాం గాని" అని పక్కనే ఉన్న ఉపాధ్యాయుడి వైపు చూసి "కాస్త కాఫీ ఉంచారా?" అన్నాడు.

"మరుగుతూంది" అన్నాడు ఉపాధ్యాయుడు.

ఫలహారంసమేతం కాఫీ పుచ్చుకున్నారు అతిథు లిద్దరున్నూ.

సింహాద్రిరావు గర్రున తేన్చి, సిగరెట్టు ముట్టించి, బడిఇంటిని చూసి నిర్ఘాంతపోయాడు. అదొక తాటాకుల పాక. మన్నెంలో వెదుళ్లకి లోప మేమిటి! తాటాకులకి లోపం అంతకన్నా లేదు. అలాంటి పాకలు ఒక్కసారిగా పాతిక వెయ్యవచ్చు. వేసే,మనుష్యులు దొరకాలిగాని! మట్టి నేల! గోడలే నేలేగు. అయితే ఒక విశేష మేమిటంటే, పాకలో ఒకవైపు నాలుగు బద్దలు అల్లి ఒక చిన్న గదిలాగు అమర్చబడింది. నామకః గది. ఆ బద్దలమధ్య నుంచి కావలిస్తే ఏ అడవిపందో, ఏచిరుతపులో దూరవచ్చు. దానికి ద్వారం ఉంది కాని తలుపు లేదు. అందులో ఎవరేనా కాపుర ముంటారా ఏమేనా! పగటిపూట నలుగురు పిల్లలు చేరితే చేరతారు. అంతే! ఒక మేజాబల్ల, ఒక కుర్చీ, నాలుగు పొడుగుపాటి బెంచీలు, ఒక నల్లబల్ల అనబడే తెల్లబల్ల, ఇవే అక్కడ ఉండే సరంజామా.

బడికి ఆనుకొనే అడివి ఉంది. ఇక్కడి పరిస్థితులు చూసి సింహాద్రిరావుకి ఒకవైపు గుండె బితుకు బితుకు మంటూంది. నేరక పోయి ఇక్కడికి వచ్చేనని మనస్సులో అనుకొన్నాడుకాని అంతటిలో వెల్తిపడిపోయే ఘటం కాదు.

నూక్కాలు పెరడే జీమూతంలాగు ఉంది. కాలు అవతల పెడితే ఏ పాముకేస్తుందో అనిపిస్తూంది.

ఇక్కడి సంగతులు చూసి సింహాద్రిరావు "ఇది పెరడా, నందన వనమా, యమలోకమా?" అని ఉచ్చరించాడు.

"మేష్టరూ! నువ్వే చెప్పు. ఇదంతా నీ సొమ్మేకదా?" అన్నాడు ఇనస్పెక్టరు.

"ఏమిటోనండి! చెట్లు ఒకవైపు కొడతూంటే ఒకవైపు పెరిగిపోతుంటాయండి!' అన్నాడు ఉపాధ్యాయుడు నిరుత్సాహంగా.

"ఒకవైపు తింటూంటే ఒకవైపు అరిగిపోతూంటుందండి" అన్నాడు సింహాద్రిరావు, సిగరెట్టు పొగ విడుస్తూ. మిత్రుడితో "ఇంతకీ రాత్రిభోజన ముందా! అని ప్రశ్నించాడు.

"దుప్పిభోజనాని కేమీ లోటు లేదు" అన్నాడు ఇనస్పెక్టరు.

"హరి! చచ్చాం! రాకరాక వచ్చిన అతిథిగతి ఇదా!" అన్నాడు సింహాద్రిరావు.

"నాతోపాటు మేతకి ఫర్వాలేదు. కుక్కరుమీద పడేస్తాను లే" అన్నాడు ఇనస్పెక్టరు. మునిమాపు అవుతూందికదా అని అతను కుక్కరుకోసం తొందరపడుతున్నాడు. బంట్రోతు సాయంచెయ్యడంకోసం సిద్ధపడ్డాడు.

"మంచి పోటాకత్తి తెప్పించిపెట్టు పంతులూ! అన్నాడు సింహాద్రిరావు ఉపాధ్యాయుడితో"

"ఒకటి కాకపోతే రెండు తెప్పించుతాను" అని పంతులు, దగ్గిర వున్న యిద్దరి శిష్యులిని పంపించాడు. వాళ్లు కత్తి ఒకటి తెచ్చారు.

ఎవరి ఇంటి దడిమీదో కాసిన రెండు పొట్లకాయలు సాధించుక వచ్చాడు పంతులు. వాటిని చూసి బ్రహ్మానందపడ్డారు మిత్రులు. "ఈ అడివిలో ఇవెక్కడ పుట్టించుకువచ్చావయ్యా!" అన్నాడు ఇనస్పెక్టరు.

"తమ దయ" అన్నాడు పంతులు.

బంట్రోతు సాయంచేయగా కుక్కరు పనితో తంటాలుపడుతున్నాడు నందకిశోరరావు.

సింహాద్రిరావు పెరటిలోకి వెళ్ళాడు. "ఈ పెరటిలో చెట్లన్నీ ఛేదించిపాకేస్తాను" అని లేచి వెళ్లి, మళ్ళీ వచ్చి, కోటు తీసి ఒక వెదురుబద్దకి తగిలించి, నడుం బిగించాడు. ఒక సీతాఫలంచెట్టు కొమ్మని కత్తితో రెండు దెబ్బలు వేశాడు. అతని నెత్తిమీద రకీమని మేకుతో పొడిచినట్లయింది. అటు వెతికాడు ఇటు వెతికాడు. ఎటు వెతికినా ఏమీ కనపడకపోగా "ఇది దయ్యమా! భూతమా!" అను

కొన్నాడు. నొప్పి విపరీతంగా ఉంది. అర్థం కాకపోగా మళ్లీ కొమ్మని రెండు దెబ్బలు వేశాడు. మళ్లీ నెత్తిమీద మేకు దిగకొట్టిన ట్లయింది. ఆశ్చర్యంతోపాటు హడలిపోయాడు. నెత్తిమీద ఒక పెద్ద కందిరీగ చప్పుడులేకుండా ఎగురుతూంది. "అమ్మా! నువ్వా!" అనుకొన్నాడు. కాస్త జాగ్రత్తగా చూసేటప్పటికి ఆ కొమ్మని కందిరీగల తెట్టె ఉంది. దానిలోంచి కందిరీగలు బయలుదేరివస్తున్నాయి. కత్తి అక్కడ పారవేసి 'బతుకు జీవుడా' అంటూ, పరుగెత్తుకొనివచ్చి పాకలో పడ్డాడు. అతను పంతులుతో "ఆ చెట్టుని కొడుతోంటే కాస్త చెప్పవద్దటయ్యా, మాబోటి దూరదేశస్థులకి ఏం తెలుస్తుంది! ఈ ఊరంతా కొత్తకదా! మా కేది వచ్చినా పూచీ నీదే కదా!" అన్నాడు.

"అదేమిటండి బాబూ" అని ఉపాధ్యాయుడు ఆశ్చర్యంగా చూశాడు.

"నెత్తిమీద చూడు, కందిరీగలు ఎలాగు పొడిచేశాయో! రక్తం వస్తున్నట్టుంది!" అన్నాడు.

"కత్తి ఎందుకు తెమ్మన్నారో ఏమిటో నాకు తెలియదండి. ఆ చెట్టుదగ్గిరకి మేము అందుకనే పోమండి! అయ్యో! పాపం!" అని అతను విచారించి, చెట్టుదగ్గిర పారవేసిన కత్తి తెచ్చుకొన్నాడు.

ఆ ఊళ్లోనే కాపురముండి పొరుగూరికి వెళ్లి బడిచదువు చెప్పుకొని తిరిగి వచ్చే ఉపాధ్యాయు డొకడు, ఇనస్పెక్టరుగారు తమ ఊరికి పరీక్షకోసం ఎప్పుడు వస్తారో అడిగి తెలుసుకొందామని వచ్చిన మరి ఇద్దరు ఉపాధ్యాయులు, అక్కడ పోగయారు.

ఇనస్పెక్టరు ఒక కుర్చీమీద కూర్చున్నాడు. సింహాద్రిరావు ఒక బెంచీమీద కూర్చున్నాడు. అతను "ఏమిటి ఈ అడివిలో విశేషాలు?" అని తెలుసుకోడానికి కుతూహలపడ్డాడు.

"అడివి కేముందండి వెధవ అడివి! ఇంత అడివి ఉందన్నమాటేగాని ఇక్కడ తినడానికి మళ్లీ ఎక్కడినుంచో తెచ్చుకోవలసిందేనండి! అంత వ్యవసాయం నేర్చిన వాళ్లు లేరు. ఏవో జొన్నలో, గంటెలో అడివిపందుల నోళ్లు, దుప్పల నోళ్లు కొట్టి కాస్త సంపాదించుకొంటారు. అంతేకాని వరిపైరు చెయ్యలేరండి" అన్నాడు మొదటి పంతులు.

"దాని మాటకేంగాని ఇక్కడుంటే పులులు, సింహాలు, ఏనుగులు, శరభ మృగాలు ఇత్యాదుల చిత్రవిచిత్రా లేమిటి?" అన్నాడు సింహాద్రిరావు.

డిప్యూటి ఇనస్పెక్టరు వింటున్నాడు.

"ఇక్కడ పెద్దపులులు, బండిచిందువులు, ఆకుచింగువులు, ఎలుగుగొడ్లు, దుమ్ములగొండ్లు ఇంట్లాంటివి కావలసినన్ని ఉంటాయండి" అన్నాడు రెండోపంతులు.

"అయితే ఈసుద్య ఎవరేనా పెద్దపులిని చూసేరా, లేకపోతే బోనులో పట్టేరా, లేకపోతే తుపాకితో కొట్టారా? ఏమిటి కథ" అన్నాడు సింహాద్రిరావు.

"మొన్న మొన్న నే ఒకాయన ఇక్కడికి కొత్తగా వచ్చేడండి. ఒక కాబూలీ అబ్బి. వచ్చినవాడు ఊరుకోకుండా పెద్దపులిని చూసి వస్తానని బయలుదేరేడండి, అదేమిటో చెప్పినట్టుగా పెద్దపులి వచ్చిందండి. ఏదో కత్తి అతనిదగ్గిర ఉందికాని దానివల్ల ఏమి లాభం? అతను జడిసి చెట్టెక్కబోతూంటే పెద్దపులి కిందికి లాగేసిందండి. చంపేసి, తినేసిందండి" అన్నాడు మొదటి మాష్టరు.

డిప్యూటి ఇనస్పెక్టరు "అయ్యో! పాపం!" అని విచారించాడు.

సింహాద్రిరావు గుండెలలో రాయి పడింది. "ఇక్కడ ఇంతేసి ప్రమాదాలున్నాయా! ఇంకా ఏమిటో అనుకొన్నాను" అని. ఇక్కడినుంచి బతికి వెళ్లే సూత్రమేమిటి అని ఆలోచిస్తున్నాడు. రావడమే పొరపాటు జరిగిందని విచారిస్తున్నాడు.

నాలుగో మేష్టరు మరొక కథ చెప్పాడు. "మన కొక ఫర్లాంగు దూరంలోనే ఒక పొలం దున్నుతున్నాడండి ఒక మన్నెంకాపు. అతను చేతిలో చువ్వ లేదని నాలుగడుగుల దూరంలో ఉన్న చెట్టు కొమ్మని విరుద్దామని వెళ్లి విరచి వచ్చేసరికి కాడి నున్న రెండెడ్లలో ఒకదానిని పులి వీపుమీద వేసుకొని పట్టుకుపోతూందండి. పాపం ఏమిటి చేస్తాడు! అది ఎక్కడ పొంచుందో, ఏమిటో గోలపెడుతూ అతను మిగిలిన పశువుతో కొంపకి చేరుకొన్నాడండి" అన్నాడు.

"ఎంత చిత్రమో! పాపం!" అని విచారించాడు డిప్యూటి ఇనస్పెక్టరు.

"ఇక్కడికి ఫర్లాంగు దూరంలోనే!" అన్నాడు సింహాద్రిరావు. అతను పై ప్రాణాలు పైకి పోయినట్టుగా కూర్చున్నాడు. ఒక ఉలుకు లేదు, ఒక పలుకు లేదు. తాను ఇక్కడికి రావడమే తప్పు పని చేసే నను కున్నాడు. "ఇదేమి చావుతో చెలగటమూ మరొకటా! ఇక్కడినుంచి బతికి కొంపకి చేరుకొన్నప్పటి మాట చూసుకుందాంలే" అని దిగులుపడిపోయాడు. అతని వాచాలత తగ్గిపోయింది. సిగరెట్టు ముట్టించి ఉట్టినే కూర్చున్నాడు.

బాగా చీకటి పడింది. ఊరు మాటుమణిగింది. పక్షుల అరుపులుకూడ తగ్గిపోయాయి. లాంతరు వెలుగుతూందన్నమాటే గాని, దాని వెలుగుని చీకటి తినివేస్తూంది. స్నేహితు లిద్దరూ భోజనానికి కూర్చున్నారు. మన్నెంలో పెరుగు వేసుకో కూడదనుకొంటూ, తినడానికి మరేమి టున్నాయనుకొంటూ, ఆ గట్టిపెరుగుని విడిచిపెట్టలేక వేసుకొని భోజన మయిందనిపించారు.

వాళ్లు చేతులు కడుక్కొంటూండగా కై - కై - కై అని మూడుసార్లు శబ్దం వినపడింది. మొదటి మాటుకంటె రెండోమాటు, రెండోమాటుకంటే మూడోమాటు శబ్దం తగ్గిపోయింది. ఏమిటా అనుకొన్నారు! పక్కనున్న మనుష్యులు కేకలు వేస్తున్నారు. 'ఏమిటి' అని స్నేహితు లిద్దరూ కంగారుపడి కనుక్కోగా, బండిచిందుఒకటి కుక్కని నోటకరచుకొని పారిపోయిందని తేలింది. ఇది తమకి నలభైగజాల దూరంలోనే జరగగా డిప్టీఇనస్పెక్టరు భయపడ్డాడు. కాని చేసేదేమీలేదు. సింహాద్రిరావు బెంబేరయిపోయి కూర్చున్నాడు. ఒంటిలో ప్రాణాలు లేవు. నోట మాట లేదు. ఏమిటి సాధనం అని ఆలోచిస్తున్నాడు.

పక్కలు వేసుకోవలసివచ్చింది. చుట్టూ చిమ్మచీకటి 'గీ' పెడుతూంది. కన్ను పొడుచుకున్నా అవతలి వస్తువు కనపడదు. స్థలం చూస్తే బహు ప్రమాద మయినది. సింహాద్రిరావుకి ఏమీ పాలుపోలేదు. చివరికి తెగించి "మనం ఎక్కడ పడుకోడం?" అని ప్రశ్నించాడు.

"ఎక్కడేమిటి, ఇక్కడే," అన్నాడు ఇనస్పెక్టరు.

"నన్ను బతికించే పూచీ నీది" అని సింహాద్రిరావు నిర్మొహమాటంగా చెప్పేశాడు.

"నిన్ను నన్నుకూడ బతికించే పూచీ దేవుడిది" అని ఇనస్పెక్టరు జవాబు చెప్పాడు.

ఇద్దరికీ చెరో రెండు బెంచీలు ఉన్నాయి. గదిగుమ్మందగ్గిర తనకి కాపుగా ఇనస్పెక్టరుని బెంచీలు వేసుకొమ్మన్నాడు సింహాద్రిరావు. "ఎక్కడైనా ఒక్కటే!" అన్నాడు ఇనస్పెక్టరు. బంట్రోతు సాయం చేయగా సింహాద్రిరావు రెండు బెంచీలు గదిలోపల వేసుకొన్నాడు. వాటి చుట్టూరా, తనపైనుంచి బట్టలు కప్పి గుడారంలాగ

తయారుచేశాడు. వెయ్యి దేవుళ్లకి మొక్కుకొని కళ్లు మూశాడు.

అతను మెలకువ వచ్చినప్పుడైన కళ్లు తెరవలేదు. ఏమాత్రం అలికిడి అయినా మొట్టమొదట ఇనస్పెక్టరుని ఎత్తుకుపోతుంది ఆ వచ్చిన పెద్దపులి అని భావించాడు. మెలకువ వచ్చినప్పుడు, కలలోనుకూడ అతని మనస్సులో పెద్దపులులు పచారుచేస్తూనే ఉన్నాయి.

ఏలాగో తెల్లవారింది. పక్షులు హడావుడి చేస్తున్నాయి. కాలకృత్యాలు తీర్చుకోడానికి నందకిశోరరావు లేచి వెళ్లాడు. మనుష్యుల శబ్దంకోసం ఎదురుచూస్తున్నాడు సింహాద్రిరావు. అంతవరకు కళ్లు తెరవదలచుకోలేదు.

మేష్టర్లు వచ్చి అతని గుడారం చూసి నవ్వుకొన్నారు. అతన్ని లేవగొట్టారు. మేలుకుని ఉంటే "అమ్మయ్యా!" అంటూ నిద్రలోంచి లేచినట్టుగా లేచి, ఒళ్లు విరుచుకున్నాడు.

"ఇంత భయమైతే ఎలాగండి పంతులుగారూ!" అన్నాడు అందులో ఒక మేష్టరు.

"నాకు భయమంటావా? నేను చేతకానివాణ్ణనుకొన్నావా? ధైర్యం లేనివాణ్ణనుకొన్నావా? మావాళ్లు వీరులు కాదనుకొన్నావా? త్యాగులు కాదనుకొన్నావా?" అంటూ చర్రుమని లేచాడు సింహాద్రిరావు.

వాళ్లు మరింత నవ్వుకున్నారు.

అతను మరింత కోపంతో "మీకేం తెలుసు నా ధైర్యం? సమయం వస్తే కొండల్ని పిండిగొట్టేస్తాను. ఏనుగుల్ని తునుమాడేస్తాను. ఎనుబోతుల్ని అవలీలగా ఎత్తిపారేస్తాను. నా పేరు ఏమనుకున్నారో! నా తడాఖా చూశారు కాదు మరి," అన్నాడు.

"ఒక్క పిసరు అబద్ధం లేదు" అన్నాడు అందులో ఒక కొంటె మేష్టరు.

"అలాగు దారిలోకి రండి. ఇది శూరవంశం. ఇది వీరవంశం, ఇది సాహసవంశం. అంతే కాని పిరికికండ మచ్చుకేనా లేదు. అసామాన్యమైనది కాని 'మరొకటి కాదు సుమండీ! మీరు పొరపడుతున్నారు" అన్నాడు సింహాద్రిరావు గంభీరంగా.

"ఏమో తెలియక మావాడు అన్నాడు లెండి! వాడి మాటల కేమిటి, పోనిద్దురూ!" అని సర్ది వేశాడు ఇంకొక మాష్టరు.

"తెలియక అన్నాడుకాబట్టి క్షమించాను. అదీ మీరు కాబట్టి. మరొకరు, మరొకరు అయితే తీసుకుపోయి పెద్దపులుల మధ్య పారేసి చక్కా వచ్చేవాణ్ణి" అన్నాడు సింహాద్రిరావు, చేతికందని మీసంమీద చెయ్యి వేసి. అతడు వీరుడి భంగిమంలో నిలుచున్నాడు.

మన కెందుకీ పిచ్చిబ్రాహ్మడితోటి అని మేష్టర్లు సమయానుకూలంగా ప్రవర్తించడం వల్ల అతను అంతటితో ఊరుకున్నాడు. కాలకృత్యాలు నిర్వర్తించుకొన్నాడు. కాని అతని కడుపులో మండిపోతూంది. "నేను ధైర్యం లేని వట్టి పిరికివాణ్ణి అని ఈ అభాజనులు, ఈ అజ్ఞానులు భావించారు. వీళ్లకి తగినట్టు బుద్ధి చెప్తాను" అని పిడికిళ్లు బిగించాడు. ఇంతటిలో డిప్యూటి ఇనస్పెక్టరు వచ్చాడు.

"ఫలహారానంతరం బండెక్కి కొంకపల్లి పోదాం" అన్నాడు ఇనస్పెక్టరు సింహాద్రిరావుతో.

"అబ్బే! నేను బండీమీద కూచుంటానా! ఎంత మాట! ఈ అడి వేమిటో! ఈ కొండ లేమిటో! ఇక్కడి మనుష్యు లేమిటో! ఇక్కడి వ్యవహార మేమిటో! ఈ కంటితో చూడడానికి వచ్చాను కాని ఇక్కడికి ఈ ఫలహారాలకోసం, ఈ బళ్లకోసం వచ్చానా?" అన్నాడు సింహాద్రిరావు.

"కాదు. నామాట విను. సుఖంగా బండీమీద పోదాం. మన కెందుకు వచ్చిన బాధ ఇది" అన్నాడు అధికారి.

"అబ్బెబ్బే! వీటి అంతు కనుక్కోవాలి" అని బుర్ర అడ్డంగా ఆడించాడు మిత్రుడు.

"అయితే ఏమిటి చేస్తా నంటావు?"

"చక్కగా నడిచి వస్తాను" అన్నాడు సింహాద్రిరావు.

"నీకు దారి ఎలాగు తెలుస్తుంది?"

"మనుష్యుల్ని వెంటపెట్టుకు వస్తాను."

"కాదు నామాట విను సుఖంగా బండీమీద పోదాం."

"ఛీ-ఛీ-ఛీ-ఛీ" అన్నాడు సింహాద్రిరావు.

సింహాద్రిరావు పట్టుదల విడిచిపెట్టేటట్లు తోచలేదు. కాని వట్టి పిరికిపంద అని ఎరిగి ఉద్యోగస్థుడు నలుగురి మేష్టర్లని అతన్ని తోడుకొని రావడానికి ఏర్పాటుచేశాడు.

సింహాద్రిరావు ఒకటి ఆలోచించాడు. నేను అడవిలో వెళ్లేటప్పుడు సిగరెట్టు కాలవను. ఎంచేతంటే, ఆ వాసనకి పసిపట్టి ఏ వేనా క్రూరమృగాలు రావచ్చు అని.

డిప్టీఇనస్పెక్టరు బండెక్కి వెళ్లిపోయాడు. నలుగురు మేష్టర్లని వెంటపెట్టుకుని సింహాద్రిరావు బయలుదేరాడు. అంతా నాటుదారి. దారిపక్కని ఉన్న అడివి చూస్తున్నాడు. అవతల ఏమిటి కనపడుతుంది! ఆకుపచ్చని గోడ! అడివిలో క్రూరజంతువుల మాట తలపుకి రాగా అతనికి ఒళ్లు గరిపొడిచింది.

"కంటితో చూస్తే భయంకాని లేకపోతే నాకేం భయం" అని, చేతిలో గొడుగు విప్పాడు. మొహానికి అడ్డుగా పెట్టుకున్నాడు. నడక ఏలాగు సాగుతుంది? మరొక ఉపాధ్యాయుడి చెయ్యిపట్టుకొని నడుస్తున్నాడు.

మొదటి ఉపాధ్యాయుడు "గొడుగు

(43-వ పేజీ చూడండి)

నాటిక:

# వీధి తొక్కెలు

మూలం: "షోలెమ్ ఆస్క్"

అనువాదం: "రాజ్‌పాల్"

చలికాలం - బజారులో ఒక మూల. నిప్పుదగ్గర చలికాచుకుంటూ వుంటారు. అక్కడే బల్లమీద బిచ్చగాడు పడుకొని వున్నాడు. వేశ్య చలికాచుకుంటూ వుంటుంది. దూరంలో కుక్కలు మొరుగుతున్నాయి. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ తాగుబోతు ప్రవేశం.

తాగుబోతు: నమస్తే వేశ్యాశిఖామణి గారూ! కుక్కలు జోరుగా మొరుగుతున్నాయే?

వేశ్య: ఎవర్నో బహుశా చూసి వుంటాయి.

తాగు: బాగా చెప్పావ్. నిన్ను చూసి ఒకవేళ దెయ్యం అనుకున్నాయేమో! అందుకనే అంత జోరుగా మొరుగుతున్నాయి. వాటి తప్పేమీ లేదు.

బిచ్చగాడు: (నిద్రలోనే) హి...హి... హో...హో...

వేశ్య: తాగుబోతూ, వేశ్యా యిద్దరూ కూడా సమానమేగా. ఏ ఒక్కరి హృదయాలూ పవిత్రమైనవి కావుగా?

• బిచ్చ: (నిద్రలోనే) హి...హి....హో... హో...అహో.

తాగు: వాడ్ని వదిలెయ్యి. వాడు రాత్రల్లా నవ్వులే కాదు నిద్రలోనే పాటలు పాడతాడు - పద్యాలుకూడా.

బిచ్చ: (నిద్రలోనే) బీదతనమనేది మనకు పాపం కాదు.

తాగు: (బిచ్చగానితో) మమ్మల్ని మాత్రం కలపకు. (వేశ్యతో) అర్ధరాత్రి కుక్కలు చూసేదేమిటి?

వేశ్య: అర్ధరాత్రివేళ అమ్మవారు వీధుల వెంబడి బైలుదేరుతుంది. ఆవిడ వచ్చి అన్యాయంగా జీవించే జీవుల్ని తనకు ఆహారంగా తీసుకుపోతుంది. వీటిని కుక్కలు చూసి సహించలేక మొరుగుతూనే వుంటాయి.

బిచ్చ: (నిద్రలోనే) పాపిష్టిహృదయాలు పగలక మానవు. బహుశా ఆవిడ హృదయం కఠినమై వుంటుందేమో.

తాగు: (వేశ్యతో) అది చాలా కష్టమే. నువ్వు వారిలో చేరతావేమో.

వేశ్య: నేను ఆవిడకి ఎప్పుడూ భయపడను. భగవంతుని దయ అపారం. అది నన్ను చేరక మానదు. మీరంతా కుక్కల సంఖ్యలోకే వస్తారు. పుణ్యకార్యాలు చేయకుండా చనిపోయినవారు జంతువులుగా పుడతారని పురాణాలు ఘోషిల్లుతూనే వున్నాయ్. వీధిలో చచ్చిపోయిన మీలాంటివాళ్లు మళ్ళీ కుక్కలే అవుతారు!

బిచ్చ: వీధులన్నీ బిచ్చగాళ్లవే బిచ్చమెత్తుకోవడంలో తప్పేమీ లేదు (అంటూనే చేతులు చాపుతూ నిద్రపోయేడు. చీకట్లోంచి అవివేకి ప్రవేశం. పొడగరి- సోల్జరుటోపి-నవ్వొచ్చే ఆకారం- కర్రకత్తిని వూపుకుంటూ అడుగులు ముందుకి).

తాగు: గుడ్ ఇవినింగ్! నెపోలియన్! ఎక్కడనుంచి రాక అవివేకిగారూ?

అవి: (చిరునవ్వు వదలుతూ) టర్కీనుంచి. అక్కడ వాళ్ళని తరిమేసి వస్తున్నాను.

తాగు: మరి సైన్యం?

అవి: కృష్ణానదిపక్కన వేయించేను పోట్టు.

తాగు: మరి రష్యావాళ్ళమీదికి ఎప్పుడు దాడి?

అవి: అర్ధరిచ్చేను.

తాగు: మరి వాళ్లు ఖాళీచేసి వెళ్లిపోయేరా?

అవి: మన ఖడ్గానికి పనికల్పించేట్టు వున్నారు.

తాగు: తమ కత్తికా?

వేశ్య: (అవివేకితో) ఆ సంభాషణ కేమి వచ్చె. యిందాకటినుంచీ చీకట్లో, చలిలో తిరిగి వచ్చేవ్-కాస్త ఒళ్లు కాచుకో.

అవి: సైన్యానికి చోటు చూపించేటప్పటికి నేను నడుంవాల్చడానికి వీలులేకపోయింది. యిక్కడన్నా....

వేశ్య: వ్యక్తి అవివేకి అయినప్పటికీ మాటల్లోమాత్రం చాకచక్యం లేకపోలేదు. యీ కాస్త అట్టుముక్క తిను.

అవి: యిప్పుడే చక్రవర్తిగారి సమక్షాన పెద్ద విందు అయింది.

బిచ్చ: (నిద్రనుండి లేస్తూ) యీ అవివేకిని యిక్కడికి ఎవరు తెచ్చేరు? యిప్పటివరకూ వీధుల్లో అల్లరిచేసి యిక్కడికి చేరుకున్నాడు. యిక్కడ పెద్దమనుష్యులు పడుకున్నారనే భయంకూడా లేకుండా యిక్కడ మళ్ళీ గొడవ మొదలెట్టేడు. నువ్వు యిక్కడనుంచి పోతావా - పోవా? (తన కర్ర తీసుకుని సమీపించబోతుండగా)

వేశ్య: (అవివేకుని రక్షిస్తూ) యీ సారికి వూరుకో. నే చెప్పుతాగా...మతిస్థిరం లేనివాడైనప్పటికీ, అతనికి నలుగురిలో తిరగాలని మహాసరదా - పాపం!

బిచ్చ: స్థిరంలేనివాడైతే శ్మశానానికి పొమ్మను. అక్కడ శవాలతో నాట్యం చెయ్యవచ్చు. యిక్కడ సుఖంగా పడుకున్న మనల్ని బాధించేదానికంటే అదే వుత్తమం. వీధులు కేవలం బిచ్చగాళ్ళవే! యిందులో పిచ్చివాళ్ళకేమాత్రంకూడా భాగం లేదు. (అంటూనే అవివేకిని దూరంగా తరిమివచ్చి పడుకుంటాడు).

తాగు: ఏమిటి యిందాకటినుంచీ పేలుతున్నావ్. వీధి కేవలం ఏ ఒక్కరిదికూడా కాదు. అందరికీ చెందుతుంది. అంతగా సుఖం కావాలంటే ధనవంతుల యిండ్లోకి వెళ్ళి పడుకో.

వేశ్య: పోనీ! వూరుకో - అతనికి హక్కు వున్నదేమో.

తాగు: ఏమిటా హక్కు. నువ్వేమన్నా కొత్తదానివా? ఎంత కాలంనుంచి నువ్వు యిక్కడ వుండటం లేదు.

వేశ్య: నేనా! నా జీవితమంతా వీధిలోనే గడిచింది. ఆ గుడివెనకాలే నా జన్మస్థానం. వీధిని మా అమ్మ చూపించింది. వీధి మా అమ్మ పెట్టిన భిక్షు. యిదే నాకు స్వగృహం. రాత్రల్లా నా స్వంతమే. సూర్యోదయమైందంటే కొద్ది జాగ్రత్తగా మసులుతూవుండాలి. వర్తకం ప్రారంభమౌతుంది. దుకాణాల్లో రూపాయల చప్పుళ్లు. మధ్యాహ్నం - రాత్రి. రాత్రల్లా

తాళాలు పడతాయి దుకాణాలకి. రాత్రి స్వేచ్ఛ!

తాగు: నీ స్వేచ్ఛాప్రదేశంలో నాక్కూడా ఒక యిల్లు వుంది. పగలల్లా కష్టపడి రూపాయికాగితాలు సంపాదిస్తాను. రాత్రి యిల్లుచేరుకుంటే యిల్లంతా యిరుగ్గానూ ... చిరాగ్గానూ ... తేళ్లూ జర్రులు పాకుతూ ఎల్లాగో వుంటుంది. యీ చీకటివీధులు నన్ను అప్పుడు ఆహ్వానిస్తాయి. పగలుమాత్రం మామూలుమనుష్యుల మనస్సులాగే వుంటుంది. చీకటి పడితేమాత్రం చాలు.

వేశ్య: అది కేవలం వీధుల ఆశీర్వచనమే అనుకుంటూ. భగవంతుని దయమాత్రం అంగుబాటులోనే వుంటుంది.

తాగు: ఏమిటది? దూరంలో పిల్లవాని ఏడుపు వినపడుతోంది?

వేశ్య: మొన్న నీదగ్గరికి రాలేదూ?-దాని ...జారజుడు. కుర్రతనం. వచ్చి చలికాచుకోవాలని ఏడుపు.

తాగు: పోయి పిలుచుకురా...

వేశ్య: వుప్!... నిశ్శబ్దం. బిచ్చగాడు లేస్తే వూరుకోడు. వాడ్నికూడా తరుముతాడు.

తాగు: ఏడ్చేడు. అన్నిటికీ వాడిదేనా అధికారం (దూ.. దూ.. అని కుక్కను పిలిచినట్లు పిలిచి జారజుని దగ్గరకు తీసుకున్నాడు) చలికాచుకో బాబూ. కాస్త రొట్టికూడా తింటావా?

బిచ్చ: (నిద్రలేచి) మళ్ళీ వీడ్ని యిక్కడికి యెవరు తెచ్చేరు? వాడిలో దెయ్యపు కళ వుంది. ఘొమ్మను వెధవని. ఆ పాపపు మొఖం చూడకూడదు. (పిల్లాడ్ని తరుమ ప్రయత్నిస్తాడు.)

వేశ్య: (ఒడిలో జారజుడ్ని దాస్తూ) అంత నిర్దయా...

బిచ్చ: నువ్వు దెయ్యానికి చెల్లెలులా వున్నావ్. అందుకనే వాడ్ని యింతగా ప్రేమిస్తున్నావ్ (సమీపించబోగా.)

తాగు: (చేతిలో కర్ర లాక్కొని) మన మంతా దెయ్యాల సుపుత్రులమే.

బిచ్చ: అంతికంటే ఎక్కువగా మాట్లాడకు. నాకు దేవుడంటే మహాప్రీతి. దేవుడు లేకపోలేదు. నాకు యిల్లు లేదు కాబట్టే వీధుల్లో జీవనం...దెయ్యాలతోటి నేను జీవించలేను. అసలు నాకు తాగుబోతులూ, జూదగాళ్లంటే మహామంట. (తనకు చెందిన కర్ర, గొంగళీ, జోలీ, పిడత వగైరా సర్దుకొని) యిది దెయ్యాల వీధి. యిక్కడ జీవించడం మహాకష్టం. నే వెళ్లిపోతున్నా... (అడుగులు సాగించేడు)

వేశ్య: (వెళ్లిపోయే బిచ్చగాడ్ని ఆపుతూ) నువ్వు మమ్మల్ని వదిలి వెళ్లిపోవడం న్యాయం కాదు. వాడే వెళ్లిపోతాడు. వాడ్ని యింక యిక్కడికి రానివ్వము. నువ్వుమాత్రం వెళ్లకు.

బిచ్చ: మీలాంటివాళ్లతో కలిసివుండడం మహాకష్టం. నన్ను నువ్వు ఆటంకపరచకు. (వెళ్లిపోతాడు)

తాగు: పోయేవాడ్ని నువ్వు ఆపడం దేనికి. మనల్ని యింత నీచంగా చూస్తూ వుంటే వాడ్ని నువ్వు బతిమాలడం దేనికి?

వేశ్య: అతడుమాత్రం చాలా మంచి హృదయం కలవాడు.

తాగు: వున్నకొలదీ బలే వుంది. నువ్వెందుకూ అనవసరంగా కంట తడిపెట్టుకుంటావ్. ఏడ్వకు.. వూ - ఏడ్వకు.

వేశ్య: లేదు—నే నెప్పుడూ మనిషిని హృదయాన్నిబట్టే ప్రేమిస్తా.

(-కుక్కలు జోరుగా మొరుగుతున్నాయ్. దూరంలో పళ్లాల చప్పుడు ... శబ్దం క్రమేపి దగ్గరికి వస్తోంది)

తాగు: ఏమిటా శబ్దం! వున్నకొలదీ దగ్గరికి వస్తోంది. (ప్రక్కన వచ్చి నుంచున్న అవివేకి నవ్వుతాడు) ఎందుకా నవ్వు... పళ్లు బైటపడ్డాయంటే చావతన్నిస్తా.

(కొద్దిసేపు నిశ్శబ్దం. అంతా భయస్థమైన ముఖాలు. యింతలో భుజాలమీద వేసుకొని దొంగ ఒక స్త్రీని తెచ్చేడు. చుట్టూ పిల్లలు మూగి పళ్లాల్ని దప్పులగా వాయిస్తున్నారు)

దొంగ: పడండి పాదాలమీద. తలకాయలు వంచండి. ఎవరు వస్తున్నారో తెల్సుకున్నారా? రాణీగారు! రాణీగారు వస్తున్నారు. (అంతా పక్కకు తప్పుకోగానే మధ్యగా నుంచున్నాడు దొంగ) ఒకడు అవివేకీ! ఓ అవివేకీ! మన సైన్యాలు కులాసాగా వున్నట్టేనా? సైన్యాన్నిమాత్రం రెడీగా వుంచు...వుంకోరు...ఓ ముంతకి స్నేహితుడివా? తాగుబోతువు! కులాసాగా వున్నావా? జీవితమంటే నీదేనోయ్ ఆనందం! ఓ నీ వారసుడు జారజుడుకూడా యిక్కడే వున్నాడే! వేశ్యామణీ, నీవ్యాపారం బాగా వుందా? అదే చాలు! (స్త్రీతో) యిదంతా నీదే. రాణీ, వీళ్లని నీతో తీసుకుపో! వాళ్లుకూడా మనకిమల్లే కుక్కలే - వీధుల్లోకి గెంటపడ్డారు. తమ ఆజ్ఞఅయితే తప్పక వస్తార.

స్త్రీ: సరే రమ్మను. అంతా కలిసే వెళ్దాం.

దొంగ: ఓ! యింకేం సంఖ్య పెరుగుతోంది. రండి నాతో.

తాగు: (కళ్లు నలుపుకుని మత్తుని వదిలించుకుంటూ) నువ్వా! దొంగవి. అప్పుడే విడుదల అయ్యి ఎన్నాళ్లయింది, యీవిడ ఎవరు? యీ పిల్లలు ఎవరు?

దొంగ: భాయీ! యిది వేళాకోళానికి సమయం కాదు. యీమె రాణీగారు! యీ పిల్లలు రాకుమారులు! వంగి నమస్కారం చెయ్యి. (తాగుబోతుని సమీపించి) వీధి కుక్కలు విడుదలకాబడిన రాత్రి అనుకో. ఆ స్త్రీమూర్తిని చూడు. మేమిద్దరమూ కూడా బంధించివున్న వాళ్లమే. అటువంటి వాళ్లము బంధనలోంచి విముక్తి చెందేము. మేమంతా ఒక్కటే కులం! మాదంతా ఒక్కటే కుటుంబం! మేము వీధుల్లో తిరుగుతాం! మా కళ్ల ఎదురుగా ప్రజలు తలుపులు వేసుకున్నారు. రండి అంతా కలుద్దాం. మీ బంధనాలనుండి విముక్తి చెందండి. నువ్వుకూడా మనిషివే! నాకు తెలుసు నీ తల్లి...

తాగు: మీ రేమంటున్నారో నాకు తెలియట్లేదు.

దొంగ: పూర్తిగా విను బ్రదర్! అదే తెలుస్తుంది. రాత్రిళ్లు వీధుల్లో కొంప లేని వాడిలా సీసాలు, ముంతలు పుచ్చుకుని తిరుగుతావు. నిన్ను చూసి నీభార్యా, పిల్లలు హడలిపోతూ దాక్కోడం నువ్వు కనిపెట్టేవా; కనిపెట్టలేదు. మాంసపు ముద్ద వన్నమాట. పగలుమాత్రం వంచిన తల ఎత్తకుండా యంత్రాలలో చెమట్లు కారుస్తూ ఎన్ని తిట్లని అందుకుంటున్నావో నీవు తెల్సుకగల్గేవా? చీకటి పడేటప్పటి కల్లా చాలు వెధవమనసు ఏమౌతుందో మరి ముంతా నువు తైతక్కలాడుతూ తయారౌతావ్.

తాగు: యింతకీ నన్నేమి చేయమంటావ్?

దొంగ: నువ్వు యీ విషయానికి చాలా సిగ్గుపడాలి—నీ జీవితంలో ఎప్పుడైనా ఒక్క నిమిషం శాశ్వతమైన ఆనందాన్ని పొందేవా? నిన్ను గౌరవంగా చూసిందెవరు? నీ బాబయ్య దెబ్బలతో నువ్వు పెంచబడ్డావ్. చూసుకో నీవీపుమీదదెబ్బలు. యింకా నీ పిన్ని అప్పుడప్పుడు నిన్ను కేకలేస్తూ - తిడుతూ, వీలుంటే చెవుకూడా మెలిపెడుతోంది. నీతో ఒక్కడూ దోస్తీగా మాట్లాడలేదు.

(తాగుబోతు వెంటనే నేలమీద పడి ఏడుపు ప్రారంభం)

దొంగ: (స్త్రీతో) మనిషి చాలా మంచివాడు. నేను వాడ్ని బాగా ఎరుగు

దును. యిద్దరమూ ఒకే స్కూలులో చదువుకున్నాం.

తాగు: నేనింక నా జన్మలో త్రాగను. వాగ్దానంచేస్తున్నాను. (ఏడుపు)

దొంగ: ఏడవకు తమ్ముడూ -'నిన్ను అనవలసిన పనిలేదు. మనమంతా యీ రోజుకి కల్సుకున్నాం. ఐక్యత ఏర్పడింది. వేశ్యనుకూడా పిలుచుకుపోదాం.

వేశ్య: నన్నుకూడా!

దొంగ: (ఆమె చెయ్యిపట్టుకుని) మనమంతా ఒకటే. నిన్ను వదలి మేము కదలం. నీకు అసలు తల్లి ఎవరు? నిన్ను పైకి తెచ్చినవారెవరు? వీధిలో మేకలా పెరిగేవు. పెద్దదాని వయ్యేవ్. జీవితాన్ని నశుఫ్రుతున్నావ్.

వేశ్య: (ఏడుస్తూ) మీలాంటి పెద్దల నోటివెంట యీలాంటి మాటలు వినలేను.

దొంగ: నువ్వు మంచిదానవే! నువ్వూ మాలాంటిదానివే. నీ శరీరం మురికైనా నీ మనస్సుమాత్రం మంచిదే. నీ మలినాల్ని అపవాదుల్ని... అవమానాన్ని... పోగొట్టుకోడానికి ప్రయత్నం చెయ్యి- నువ్వు మానవస్వరూపిణివి అవుతావు. అసలు నువ్వు మంచిదానివే. పురుషులే నీ మనస్సుని మార్చేరు. ప్రేమించి కొత్తపారాలు నేర్పేరు. వాళ్లే యిప్పుడు నిన్ను అనరాని మాటలు అంటున్నారు. పాపపరిహారం చేస్తానుండు (గ్లాసులోని నీళ్లు వేశ్యమీద చల్లి) అదుగో చూడు, ప్రకృతి ఎంత శోభాయమానంగా వుందో? నువ్వు మా సమక్షాన వుండడం నీ తల్లి చూసి సంతోషిస్తోంది. చూసి నవ్వుకుంటూంది.

(దొంగ, వేశ్యపక్క తాగుబోతుని నుంచోపెట్టేడు. యిద్దరి చేతుల్ని కూడా కదిపేడు. వేశ్య చిరునవ్వు నవ్వింది.)

దొంగ: మీ రిద్దరూ యిప్పుడు దంపతులయ్యేరు. దేవదూతలు కొత్తబట్టలు తెస్తారు. మీ తల్లి దీవిస్తోంది. కోయిలలు కూస్తున్నాయి.

తాగు: (స్వరాన్ని హెచ్చిస్తూ) నేను యీమెను మాత్రం వదలను. యీమెకోసం జీవితాన్ని త్యాగం చేస్తాను.

దొంగ: అదీ లెక్క! నేటికి కుక్కల్లో ఐక్యత యేర్పడింది. యీ జారజుడు కూడా మనవాడే. మన మంతా ఒకటే.

తాగు: (దొంగదగ్గరనుంచి జారజుని తీసుకొని) వీడు మా పిల్లాడు. మాతోటే వుండాలి. (వేశ్య చెయ్యిపట్టుకొని) రా! నువ్వు జారజుని యెత్తుకో, అంతా కలిసి పోదాం.

దొంగ: అది నేటికి కుక్కలు కల్సుకున్నాయి. అదీలెక్క! వాయించండి, మ్రోగించండి భేరి! నేటికి రాణీ దొరికింది, (అవి వేకితో) సైన్యం సిద్ధంగా వుందా? రాణీగారు వస్తున్నారు! యిక్కడే మనం శత్రువులతో యుద్ధం చెయ్యాలి— సైన్యం తర్ఫీదులో వుందా?

అవి: (సంతోషంతో) ఓ యస్!... లెఫ్ట్... రైట్... లెఫ్ట్.

దొంగ: అర్థరిచ్చేయి—అశోకుడివంతటి వాడవు. నీ కత్తి చూపించు.

అవి: (తనకు ఎదురుగా సైన్యం వున్నట్లు పక్కకు తిరిగి కొయ్యకత్తిని ధీమాతో పట్టుకొని గట్టిగా అరచేడు) లెఫ్ట్... మార్చ్... స్టాప్.

దొంగ: నేటికి కల్సుకున్నాయి వీధి కుక్కలు. యీవిడే మన రాణి. భేరీ మ్రోగించండి. సింహాసనం ఎక్కి కిరీటం పెట్టుకోవడానికి యీమె అర్హురాలు. మ్రోగించండి గట్టిగా. అంతా తలలు వంచి నమస్కారం చెయ్యండి— రాణీ వస్తోంది! అంతా కలిసిపోదాం.

మన లోకం పోదాం.

(రాణీముఖం ఎంతో కళావంతంగా వుంది. మొఖం యవ్వనంగా నిగనిగలాడుతోంది. ఆమెను చూచిన ప్రతివారి హృదయాలుకూడా కరిగిపోతున్నాయి. వేశ్య రాణిపాదాలమీద పడి ఏడుస్తూ)

వేశ్య: తల్లిని చూడండి. తల్లికాదు దేవతాస్త్రీ— స్వర్గంలోంచి వచ్చింది. తల్లీ నన్ను నీ వడిలోకి తీసుకో... (మాట్లాడలేకపోయింది. అందరూ కూడా వేశ్యనోటి వెంట వచ్చే మాటలకోసమే ఎదురు చూస్తున్నారు. రాణిలోని తేజస్సును చూసి హడలిపోతున్నారు. అంతా తలలు వంచేరు గౌరవంగా. కొద్దిసేపటికి సాష్టాంగపడ్డారు. యింతలో వెనుకనుంచి ఎవరో వస్తున్నట్లు అలికిడి—)ఆమె తాగుబోతు భార్య.

తాగుబోతు భార్య: యిదిగో యిక్కడ యేం చేస్తున్నావు- కొంపకి రాకుండా.

తాగు: (నుంచున్నాడు. కళ్లమ్మట నీళ్లు కారుతున్నాయి. నీళ్లు తుడుచుకుంటూ వేశ్యనిచూసేడు. రాణీని దొంగని వదలడానికి మనస్సు యిష్టపడలేదు.) రాణీ! ఆరాణీ! యీవిడ్ని నేను ఎరుగుదును. మనవాడు!- నాగన్న!- మిల్లులో పనిచేసే నాగన్న భార్య. దొంగ బలేఎత్తువేసేడే (అంటూ పరిగెత్తేడు. తాగుబోతుభార్య వెళ్లిపోయింది. అంతా లేచేరు. అకస్మాత్తుగ వేశ్య లేచింది సాష్టాంగనమస్కారంలోంచి. రాణి! మిల్లులో పని చేసే నాగన్నభార్య దొంగ చేతుల్లోంచి పారిపోవాలనుకుంది.)

రాణీ: నన్ను నడిబజారులోకి దేనికి లాక్కొచ్చేవ్?

దొంగ: (ఆమె చేతిని పట్టుకొని) నాతోరా. మనం మొదట్లో అనుకున్నది జ్ఞాపకం తెచ్చుకో. యింకో ప్రదేశానికి పోదాం రా. లేకపోతే మరో దేశం పోదాం రా.

రాణి: (ఏడుస్తూ) నన్నతడు ఏమి చెయ్యా లనుకున్నాడు? నన్నెందుకీ నడి బజారులో తిప్పుతాడు? యింటికి పోదాం రండి పిల్లలూ.

(అంతా అతగాడినుంచి పారిపోయేరు)

దొంగ: (వీధిగోడ కానుకొని ఆలోచిస్తూ) కుక్కలూ! పారిపోతున్నా రెందుకూ, వీధికుక్కల్లో కూడా ఐకమత్యం లేదూ?






మంచంమీద వెల్లకిలాపడుకుని "ఫిలుమ్ పిక్టోరియల్" పేజీలు ఆలోచనగా తిరగవేస్తున్నాడు విశ్వనాథం. ఎందుకో "బర్సాత్"లోని "నిమ్మీ" బొమ్మ కళ్ళల్లోపడేసరికి, అతని దృష్టి ఆగి, చెప్పలేనిబాధ నా బొమ్మపై ప్రసరించింది. ఆ సమయంలో అతని మొహం చూస్తే, ఎవరిపైనో తీర్చుకోలేని కసి, వందలమైళ్ళ దూరానవున్న "నిమ్మీ" మీదను, ఆమె బొమ్మమీదను తీర్చుకుంటున్నట్లుగా మనకు గోచరిస్తుంది. మరీ, తనమీదనే ఆ కసి తీర్చుకుంటున్నాడా, అని కూడా తోచకపోదు. మొత్తంపైన, అతను తీవ్రమైన వేదనకు లోనవుతూన్నట్టుగా మనం సులువుగా ఊహించగలం.

వనకయింట్లో బిందెలసవరింపు, విశ్వనాథం దృష్టిని మరల్చింది. కొన్ని నిమషాల్లో, రాధ తన గదిలోనికి వస్తుందనీ, అన్నిపనులూ ఆ రాత్రికి ముగిశాయన్నశబ్దం అదేననిన్నీ, అతనికి తెలుసు. వెంటనే, తన పుర్రెలోని ఆలోచనలచే మథనపడుతూన్న హృదయాన్ని అత నరికట్టి, నిశ్శబ్దంగా పేజీలు తిరగవేయ సాగేడు.

ఉయ్యాల్లో పడుకున్న బాబ్జీ పీడకల వచ్చిందేమో త్రుళ్ళిపడి, కెవ్వుమని ఏడవటం మొదలెట్టాడు. అసలే చికాకుగా వున్న విశ్వనాథం దానిని సహించలేక, "రాధా!" అని కేక వేశాడు; వెనకింట్లోకి.

కొన్ని సెకండ్లు దాటాయ్. పిల్లాడు పంతగించిన వానిలా జోరుకున్నాడు ఏడుపుకి.

"రాధా!" అని తిరిగి కేక వేశాడు విశ్వనాథం.

"అబ్బ! ఒచ్చానండీ!" అని ఉయ్యాల నొకచేత్తో ఊపుతూ, "ఏం - ఆ పాడు సినిమా పుస్తకంలోని బొమ్మలను చూస్తూ పడుకోకపోతే, పిల్లాడిని కొంచం జోకొట్ట రాదూ?" చిన్నగా సణిగింది రాధ.

"ఆ! అదే - ఆమాటే - నువ్వు చెప్ప లేదని చూస్తున్నా."అని ఫిలుమ్ రెవ్యూలను చదువుకుంటున్నాడు విశ్వనాథం.

"ఆహా! పాపం - నేను చెప్పలేదనే గాబోలు, సిగరెట్లు తాగుతున్నారు, సినీమాలకు పోతున్నారు. ఇంకా...ఇంకా... మీ కిష్టమైనవీ, నా కిష్టంలేనివీ అనేకపన్లు చేస్తున్నారు. ఏం?" అని, నిద్రబోతూన్న కుర్రాడి ఉయ్యాలొదిలి, చేతిలోని ఫ్లాస్కు టేబిలుమీదుంచి, మరో మంచంమీద నడుం వాల్చింది రాధ.

కొన్ని నిమషాలు మౌనంగా గడిచింది

(21-వ పేజీ చూడండి)




ల్లారు జామున నాలుగుగంటలకే తెలివి వచ్చేసింది పేరయ్యకి. మళ్ళీ నిద్ర పోదామని ఎంతో ప్రయత్నం చేసేడే కాని లాభం లేకపోయింది. లేచి మంచంమధ్యని కూర్చున్నాడు. దీపం కొడిగట్టిఉండడం చేత కాంతి తృప్తి లేదు. ముసలితనం అవడం చేత పగలే దృష్టి సమంగా ఆనదు!... ఇక రాత్రి బొత్తిగా కనిపించదు. అంచేత తను ఆ సమయంలో కళ్లు మూసుకొనినా ఒకటే!— తెరచినా ఒకటే! ఏమయినా గ్రుడ్డికన్నా మెల్ల నయ

మన్నట్లు, కళ్లు మూసుకొని కూర్చునేకన్న తెరచి కూర్చుంటే కొంతవరకూ నీడల మాత్రంగానైనా దృష్టిఆనుతుందని కళ్లు తెరచే కూర్చున్నాడు మంచంమధ్యని మఠం వేసుకొని!!- ఆ ఇల్లు పురాతనపద్ధతులలో కట్టిన దవడంచేత కిటికీలు లేనేలేవు. శీతాకాలం అవడంచేత ఆ ఉన్న ఒక్క తలుపూ మూసేసుకున్నారు. అయినా చలి వేస్తున్నాదికాబోలు! దుప్పటీ కప్పుకొని కూడా "ఉహుహుహు" అని వణుకుతూ కూర్చున్నాడు పేరయ్య. ఏమయినా ముసలితనంకదూ!... ఏమాత్రం చలి వేసినా వణికిపోతాడు.

భర్తలేచిన అయిదు నిముషాల్లోనే భార్య రవణమ్మకూడా లేచిపోయింది. శీతాకాలం కదా మరి!...రాత్రిభాగం ఎక్కువ! సాయంత్రం ఆరుగంటలకే చీకటిపడిపోతుంది కనక ఆరున్నర అయేసరికే రాత్రి భోజనాలు అయిపోతాయి! ఇక అక్కడినుంచీ నిద్రపోవడమేగా ముసిలాళ్ళకు పని!....

ఆవాళ పేరయ్య రాత్రి ఏడుగంటలకే పడుకోవడంచేత, తెల్లారుజామున నాలుగు గంటలకే తెలివి వచ్చేసింది. నిద్ర లేచినవెంటనే చుట్ట కాల్చడం ఓ అలవాటు పేరయ్యకి. చుట్టలకట్టకోసమని అలమరమీదకి చెయ్యిజాపి వెతికేడు. కానీ కట్ట ఎక్కడా కనిపించలేదు. క్రిందికి పడిపోయుంటుందని అనుకున్నారు. ఆ చీకటిలో తన కెలానూ కనిపించ దది! అంచేత...

"ఔనేయ్!.... నా చుట్టలకట్ట క్రిందకి పడిపోయినట్లుంది. వెతుకుమీ," అని భార్యనుద్దేశిస్తూ అన్నాడు పేరయ్య.

"అబ్బ!— ఆ మంచంక్రిం దెక్కడో పడిపోయుంటుందండీ!... నేను దాని క్రిందికి దూరలేనాయె!... పోనీ కామాక్షయినా లేదు. అదయితే దూరగలదు!" అంది రవణమ్మ విసుక్కుంటూ లేచి అలమర వేపు వెళుతూ.

"కామాక్షి లేదూ?... ఎక్కడికెళ్లింది?... ఇంతసేపయి ఇక్కడే ఉన్నదనుకుంటున్నాను!" అని ఆశ్చర్యంతో అడిగేడు పేరయ్య.

"మన కామయ్యగారింటి కెళ్లిందండీ!. వాళ్ల శీతాయీ, ఇదీ రాత్రి బాతాఖానీ కొడుతూ పదకొండువరకూ మేలుకున్నారట!... మళ్లీ చలిలో అక్కడనుంచి రావడం కష్టమని శీతాయి దాన్ని అక్కడే పడుకోమని చెప్పి, వాళ్ల పాలిగాడిచేత కబురంపిం దావిషయం."

"వెఱ్ఱితల్లి!... శీతాయి అంటే ఎంతో అభిమానం దానికి! నిజంగా ఎంత అక్కచెల్లెళ్లయినా అంత అన్యోన్యంగా ఉండరు. అన్నట్టు నాచుట్టలకట్ట వెతికావా?" అని అంటూఉండగానే రవణమ్మ కట్టను వెతికి చేతి కందించింది,

"అలమరలోనే ఉం దది!... అంతలా వెతికేరన్నమాట!" అని అంటూ.

"అలమరలోనే ఉందా?... సరేగానీ దాని కక్కడ కప్పకుండికి ఉందో, లేదో," అన్నాడు పేరయ్య చుట్ట నోట్లో పెట్టుకుంటూ.

"ఆ లేకేం?... కావలసినన్ని దుప్పట్లు వాళ్లింటినిండా!"

"అన్నట్టు నీకి విషయం తెలుసూ?- వచ్చే ఆదివారంనాడు, శీతాయిని చూడడానికి పెళ్లికొడుకు వస్తున్నాడు."

"ఔనుట!... నిన్న ఉదయమే తెలిసింది. మీతో చెప్పుదామనుకుంటూనే మరచిపోయాను... కుర్రాడేమో కాకినాడలో ఇంటర్మీడియట్ చదువుతున్నాడుట!...రెండు మేడలున్నాయట!. సాలుకు వెయ్యిరూపాయలు శిస్తు వచ్చే భూమికూడా ఉందిట!... కుర్రాడికి తండ్రి లేడట!... అంతా ఆ కుర్రాడిదే పెత్తనం. ఎఱ్ఱగా బాగానే ఉంటాడని వాళ్లనాన్నగారు అన్నారుట. ఆదివారంఉదయం ట్రయినులో వస్తారట పిల్లనీ చూడ్డానికి." అంది రవణమ్మ.

"కట్నంవిషయమై ఏమయినా తెలిసిందా?" అని మళ్లీ పేరయ్య ప్రశ్న.

"వాళ్లు కట్నం ప్రత్యేకించి అడగలేదుగానీ వీళ్లే 'వెయ్యిరూపాయలవరకూ ఇస్తా'మని అన్నారట. పిల్ల నచ్చితే చేసుకుంటామన్నారు." అంది రవణమ్మ.

"ఏమయినా డబ్బున్నవాళ్లు!... ఎంత కట్నమయినా ఇచ్చుకోగలరు, వాళ్లకేం?" అని ఓ రకమయిన నిస్పృహతో అన్నారు.

తన కెందుకా నిస్పృహ! ఏం?...వాళ్ల పిల్లకు మంచి సంబంధం వస్తే తన కేం?...

...ఔను మరి!... తన కూతురితో సమానవయస్సుగల సీతాయికి పెళ్లి సంబంధం కుదరబోతున్నది. తన కూతురి పెళ్లివిషయంమాత్రం ఏ నిశ్చయానికీ రాలేదు. ఆ సందర్భంలో ఎవరికైనాసరే ఆందోళన ఉండడం సహజం. ఆందోళనపుం టేమాత్రం తనేం చేయగలడు? ఏవో కొన్ని సంబంధాలు చూచేడు. కానీ చింకి గంప పెట్టుకుని కూర్చున్నారు వరుడు తరఫువాళ్లు!... వాళ్లు కోరినంత కట్నం తను ఎలానూ ఇచ్చుకోలేడు. అందుకే అతని కా ఆందోళన.

* * *

ఆదివారం వచ్చింది. పెళ్లిచూపులకు వస్తారని కామయ్యగారు ఇంటినంతటినీ అందంగా తయారుచేసేరు. వీధి సావిట్లో ఓ టేబిలు, దానిచుట్టూ నాలుగు కుర్చీలు, మరో వార రెండు ఈజీచైరులు, గోడమీద హిందూదేశపు దేవుళ్ల బొమ్మలూ 'ఎరేంజి' చేసేరు అంతకు ముందుపడిన ఓ పెద్దవానకి వీధి ప్రహరీగోడ పడిపోయింది. అది అలా ఉంటే చాలా అసహ్యంగా ఉంటుందని, ఆగోడ పెట్టించేసేరు. దానికి సిమ్మెంటు ప్లాస్టింగ్ కూడా చేయించేసేరు. ఇంటంతటకీ సున్నాలు వేయిద్దామనుకున్నారేగానీ, 'టయము' చాలిందికాదు. అయినా మొత్తంమీద ఇల్లు చూడడానికి చాలా అందంగానే ఉంది.

ఇక వాళ్లొచ్చిన తరువాత, ఎదో ఓ టిఫిన్, కాఫీ ఇయ్యాలి. భోజనం చెయ్యమన్నా చెయ్యరు. ఎంచేతాఅంటే "కతుకుతే అతకదు." అన్న విశ్వాసం వాళ్లకీ ఉండొచ్చు!... వాళ్లకా విశ్వాసం ఉన్నదో లే తెలియదుగానీ, కామయ్యగారికి మాత్రం ఆ నమ్మకం బాగా ఉన్నది. అదివర కోమారు తాను పెళ్లిమాటలకని వెళ్లి, వాళ్లు బలవంతంపెట్టడంచేత అక్కడ భోంచేసీసేరు. తరువాత ఆ సంబంధంకూడా కుదరలేదు. తను ఎలా భయపడ్డాడో అలానూ జరగడంచేత ఆ విషయంలో అతని నమ్మకం మరీ బలీయమయింది!... ఆ వచ్చే వాళ్లని మాటవరసకు ఓ మారు "భోజనంచేయండి" అని అనా అట్టే బలవంతంపెట్టకూడదని నిశ్చయించుకున్నారు కామయ్యగారు. ఎందుకయినా మంచిదని క్షీరాన్నంకోసం, పంచదార సగ్గుబియ్యం జాగ్రత్తచేసుంచేరు.

అవాళ తొమ్మిది గంటలకు వాళ్లొస్తారనగానే, ఉదయం ఏడుగంటలనుంచే శీతాయిని అలంకరించడం మొదలుపెట్టింది కామాక్షి. మొత్తాని కెలా అయితే నేం, చాలా బాగానే మేకప్ చేసింది కామాక్షి.

"శీతాయీ... మొగాళ్ల దృష్టిలో ఆడది ఏరకంగా ఉంటే అందంగా ఉంటుంది?" అని చటుక్కున ఓప్రశ్న వేసింది కామాక్షి.

"ఏమో!... నాకేం తెలుసు!!... ఇంతకీ ఈ వేషంలో నేను నీకు నచ్చేనా?" అంది శీతాయి నవ్వుతూ

"మరి నాకంటికి నువ్వు నచ్చవు. నేనే మొగాణ్ణయి ఉంటే.."

"ఆ! నువ్వే మొగాడి వయిఉంటే, అప్పుడు కూడా మనస్నేహం ఈరకంగానే ఉంటే, మనిద్దరం ఒకరి కొగి..."

ఆఁ ఆఁ. తగ్గించు నీ భావతరంగాలని!... ఇప్పటికి ఇలా అన్నావు. ఇంకోగడికి 'ఆడదానివయినా నిన్నే పెళ్లాడేస్తాను' అని అనేకరంలాగున్నావు," అంది కామాక్షి.

ఇద్దరూ పకాలున నవ్వుకున్నారు.

"సరేగానీ, పెళ్లికొడుక్కి నువ్వు నచ్చేవనుకుందాం!... ఆయనగారు నీకు నచ్చకపోతే?" అని మరో క్లిష్టసమస్యను ప్రవేశపెట్టింది కామాక్షి.

"ఔను సుమా!...అదీ ఓ సమస్యే!!... 'బాగానేఉంటార' ని మా నాన్నగారు అన్నారు." అంది శీతాయి.

"ఇంతకీ ఈ కట్నాలకాలంలో వరుడి బాగోగులతో సంబంధంఏమిటి? వరుడంటూ ఒకడుంటే వాడు బాగున్నవాళ్లలోజమే! ... ఇంకో విచిత్రం చూచేవ్!... పిల్లకి, కుర్రాడు నచ్చినా నచ్చకపోయినా, కుర్రాడికి మాత్రం పిల్ల నచ్చితే చాలును?" అంది కామాక్షి.

"సరేగాని, పెళ్లయినతరువాత నేను అత్తవారింటికి వెళ్లిపోవాలి కాబోలు!" అంది శీతాయి ఓ రకమయిన ఆందోళనతో!

"నీ కత్తారింటికి వెళ్లడం ఇష్టం లేకపోతే, ఇల్లరికం రమ్మంటారు. మీ కేం?" అంది నవ్వుతూ.

"అది కాదు కామాక్షీ!... పెళ్లయిన తరువాత మనిద్దరం దూర మవుతాంకదా, అని" అంది అమాయకంగా.

"మన హృదయాలలో అభిమానం స్థిరంగా ఉంటే మనం దూరంగా ఉన్నా, ఒకరి హృదయంలో ఇంకొకరం ఎప్పుడూ ఉంటూనేఉంటాం."

"ఏమోగానీ, అదోరకమయిన బెంగగా ఉంది కామాక్షీ!— ఇక నీకూ పెళ్లిఅయిపోతే నువ్వూ అత్తవారింటికి వెళ్లిపోతావు. మళ్లీ మనిద్దరం ఎప్పుడయినా కలుసుకోగలమా? ఆ తరవాత మనకి స్వాతంత్ర్యం ఉంటుందని ఏమిటి నమ్మకం?"

అంతవరకూ తన పెళ్లిగురించి గానీ,తన భవిష్యత్తుగురించి గానీ, ఎన్నడూ కామాక్షి ఆలోచించనేలేదు!. కానీ అప్పుడు మాత్రం ఆలోచనలో పడింది. తన పెళ్లిమాట ఏంగాను?... అసలింతకీ తనకు పెళ్లవుతుందా? తన తండ్రి తనకు కట్నంతో పెళ్లి చేయగలిగే స్థితిలో ఉన్నాడా? ఒకవేళ పెళ్లిచేయగలిగిన ఎలాంటి సంబంధం వస్తుందో?... ఆమె ఆలోచనలు అనేక రకాలుగా పరుగెత్తేయి. శీతాయికి పెళ్లవుతుందంటే, మధ్య తనెంతో ఆనందపడుతున్నది. కానీ తన పెళ్ళంటే ఆనందపడేవాళ్లెవరు;... కనీసం తనకయినా ఆనందం ఉంటుందా? ... శీతాయి పెళ్లంత వైభవంగా తన పెళ్లి జరుగుతుందా?— సమాధానాలు రకరకాలుగా ఆమెబుర్రలో చలించేయి.

కామాక్షి అలా మౌనంగా ఉండడం చూచి "ఏమిటలా ఆలోచిస్తున్నావు." అంది శీతాయి.

"ఆ!... ఏమీ లేదు. తొమ్మిదిగంటలయింది కదా, ఇంకా వాళ్లు రాలేదేమా? అని." అంది కామాక్షి తడబడుతూ.

అంతట్లోనే వీధిలో బండీ ఆగిన చప్పుడయింది. "దయచేయండని" అన్న కామేశంగారి గొంతు వినిపించింది.

"అదుగో నేవ్... వాళ్లే వచ్చుంటారు." అంది ఆత్రుతతో కామాక్షి. అంతవరకూ లేని సిగ్గూ భయం ఆవేశించింది శీతాయికి. అంతట్లోకి కామేశంగారు లోపలకు వచ్చి, "వాళ్లొచ్చేరు. కాఫీ, అదీ తయారుచేయమని ఇంట్లోచెప్పు కామాక్షీ!... తల రేగిపోయినట్లుంది దువ్వుకో శీతాయి!"... అంటూ మళ్లీ తొందర తొందరగా వీధిసావిట్లోకి వెళ్లిపోయేరు.

గబగబా అద్దందగ్గరకు వెళ్లింది శీతాయి! అద్దంలో చూచుకుంది ముఖం. పన్ని తీసింది. రేగినదగ్గర మళ్లీ దువ్వుకుంది. 'స్నో'ముద్ద తీసి ముఖానికి పులుముకుంది. దానిమీద పౌడర్ కోటింగ్ వేసింది. మళ్లీ పూర్తిగా కోటింగ్ వేసుకున్నట్లుంటే బాగుండదని తువ్వాలతో పైపైని తుడిచేసుకుంది. అంతట్లో వంటింటిలోకి కబురుచెప్పడానికి వెళ్లిన కామాక్షి తిరిగి వచ్చింది. "శీతాయీ... మీ కాబోయే ఆయన ఎలాగున్నారో తెలుసా?" అంది.

"నువ్వు చూసేవేమిటే? . ఎలా గున్నారే తెల్లగా..."

"ఆ! ఆ! తగ్గూ...అట్టే వర్ణించకు. తాపీగా విను..."

"అబ్బా! వేగిరం చెప్పవే, నీకు నచ్చేరా?"

"ఊఁ... చూడ్డానికి... బాగా ఉన్నట్లే!" అంది కామాక్షి నవ్వుతూ.

"అయితే తెలివి తేటలు అట్టే ఉండవనా నీ తాత్పర్యం?" అంది శీతాయి.

"నాకేం తెలుసు? నేనేం అతన్ని పరీక్ష చేశానంటావా?" అంది కామాక్షి.

"నే నేమాట చెప్పినా విమర్శిస్తావు నువ్వు," అంది శీతాయి కోపంవచ్చినదానిలా మూతిపెట్టి.

"విమర్శించడం కాదే!......వాళ్లొచ్చేరన్న సంగతి మీ అమ్మతో చెపుదామని వంటింటిలోకి వెళుతున్నప్పుడు, ఇంకా వాళ్లు సావిట్లోకి రాలేదేమో నని గబుక్కున సావిట్లోకి వెళ్లేను. వాళ్లు అప్పుడే అక్కడ కుర్చీలమీద కూర్చున్నారు. ఆయన నావేపు చటుక్కున చూచేరు. నాలిక కరచుకొని సావిట్లోంచి ఒకే గెంతున వచ్చేసే నివతలకి. ఆయన తండ్రి కాబోలు! "ఆపిల్ల..." అని ఇంకా ఏమో అనబోతూ ఉండగానే, పరిగెత్తి మీయమ్మదగ్గరకు పారిపోయేను. ఏమయినా నువ్వు అదృష్ట

వంతురాలివి. ఆయనగారు నీకు నచ్చక పోరులే!" అంది కామాక్షి.

"ఊఁ అలాగేం?..... ఇంతకీ నువ్వు అదృష్టవంతురాలివి కావంటావు?"

"ఎందుకు కాను? ...ప్రియస్నేహితురాలి పెళ్లి సందర్భంలో పాల్గొనడం అదృష్టం కాదూ? నువ్వు నా వివాహమప్పుడు నా అంత స్వతంత్రంగా పాల్గొగలవా? అప్పుడు మీ ఆయన నీకనుమతి ఇస్తారా?...సరేలే, అవంతా ఇప్పుడెందుకు? అన్నట్లు అవతల మీ అమ్మగారికి సాయం చేయాలి." అంటూ వంటింటివేపు పారిపోయింది కామాక్షి.

పెళ్లిచూపులు అయేయి. "పసుపూ కుంకం ఎప్పుడు ఇమ్మంటా"రని అడిగేరు కామయ్యగారు. 'మేమక్కడకు వెళ్లిన తరువాత ఆలోచించి ఏవిషయం ఉత్తరం వ్రాస్తామని,' పెళ్లికొడుకుతండ్రి అని, కామయ్యగారిని ఆందోళనలో ముంచి వెళ్లిపోయేరు.

*　　*　　*　　*

ఉత్తరం వస్తుందేమో నని, ఓ వారం రోజులపాటు ఎదురు చూచేరు కామయ్యగారు. కానీ ఉత్తరంమాత్రం రాలేదు. అతని ఆందోళన మరీ హెచ్చయింది. ఆ ఆందోళన, ఆందోళనగానే ఉండిపోక ఓ నిశ్చయానికి వచ్చేసింది. కుఱ్ఱాడికి పిల్ల నచ్చలేదని తెలిసింది. పైగా మరో విచిత్రమయిన విషయంకూడా లోకంనోళ్లలోంచి బయటపడింది. "పేరయ్యగారి కూతురు కామాక్షి చాలా బాగుందిట! దాన్ని పెళ్లాడతాడట!" అని. ఈ విషయం పేరయ్యకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది— కామయ్యగారికి మాత్రం ఈర్ష్యాకోపాలను, రెండింటినీ కలుగజేసింది. ఫలితంగా కామాక్షి శీతాయిలు వేరుచేయబడ్డారు!!...

—ఇంతకీ జరిగిన సంగతేమిటంటే, పెళ్లిచూపులకని వచ్చినప్పుడు మొదట కామాక్షిని చూచి, అదే కామయ్యగారి కూతురని భ్రమించేరు. కానీ, ఆ తరువాత, కామాక్షి పేరయ్యకూతురని తెలుసుకున్నారు. ఆ తరువాత శీతాయిని చూడ్డం జరిగింది. వరుడి కళ్లకు శీతాయి నచ్చలేదు. నిజానికి శీతాయి అంత అందమయినదికూడా కాదు. అదీకాక ఓ అపూర్వజ్యోతిలా అగుపించిన కామాక్షిమీద లగ్నమయింది వరుడి మనస్సు!...కట్నం లేకపోయినా సరే 'కామాక్షినే పెళ్లి చేసుకుంటా'నని పట్టుపట్టేడు. ఆ విషయం లోకానికి తెలిసింది. ఇకనే?...ఒక్కమారు 'గుప్' మంది. "ఇంతకీ పేరయ్యగారదృష్టవంతులు." అన్నారు కొందరు వేదాంతులు— "ఆ పిల్ల పూర్వజన్మలో నోచిన నోముల ఫలితం!" అన్నారు ఆడమ్మలక్కలు— "ఇంతకీ అది బంగారపు బొమ్మలాగుంటుంది. ఎగిరెగిరి దాన్ని చేసుకుంటారు." అన్నారు కొందరు—

లోకం ఏరకంగా పేరయ్యపట్ల ఉంటున్నప్పటికీ, కామయ్యకుటుంబానికి మాత్రం, పేరయ్యకుటుంబంమీద ద్వేషం ప్రబలింది. తనకు పోటీగా పేరయ్య వచ్చేడని కామయ్య అభిప్రాయం!...

ఇంతకీ ఆ పరిణామానికి ఎవరు బాధ్యులు?

కామాక్షిహృదయంలో తుపాను చెలరేగింది!... శీతాయిని విడిచిఉండటం దుర్లభమయింది. ఒకనాడు పెరటిదారంట దొంగతనంగా పోయి శీతాయిని కలుసుకుంది. "శీతాయీ...నావల్ల ఏదయినా తప్పుందంటావా?" అని అడిగింది కన్నీరు కారుస్తూ—

—సమాధానం చెప్పకుండా ఇంట్లోకి వెళ్లిపోయి తలుపేసుకుంది శీతాయి. నిలువునా నీరయిపోయింది కామాక్షి. శీతాయిలోకూడా అంత మార్పు వస్తుందని ఏనాడూ అనుకోలేకపోయింది. బరువయిన హృదయంతో ఇంటిముఖం పట్టింది.

'ఇంతకీ ఎవరిదీ తప్పు?' అని ప్రశ్నించుకుంది కామాక్షి!.. తను అందంగా ఉండడమేనా తన తప్పు? వరుని కళ్లకు తను నచ్చడమేనా తన తప్పు?...శీతాయి ఇంటికానాడు వెళ్లడమా తన తప్పు?-అసలు శీతాయిని అంతలా తను ప్రేమిస్తూఉండడమేనా తన తప్పు?...జరిగినదేదో జరిగిపోయింది!! శీతాయి అలా తనని ఎందుకు దూరం చెయ్యాలి? దానికయినా ఆమాత్రం జ్ఞానం ఉండక్కర్లేదూ? 'అసలు శీతాయికి తనమీద హృదయపూర్వకమయిన అభిమానం లేదూ?"...ఈ విచిత్రపరిణామం కామాక్షిమనస్సులో మానని గాయాన్ని ఏర్పరిచింది.

*　　*　　*　　*

కామాక్షివివాహం వైభవంగా జరిగిపోయింది. శీతాయిని కోరుండి వెళ్లి పిల్చినప్పటికీ రాలేదు. "శీతాయీ! ఈ విచిత్ర పరిణామానికెవరం బాధ్యులం?....నావల్ల దోషం లేదన్న సంగతి నీకూ తెలుసు!... అనవసరంగా నన్నపార్థం చేసుకుని నావివాహానికి రావడం మానేసేవు. సరే, నీ వివాహానికిమాత్రం నువ్వు పిలవకపోయినా వస్తాను." అంది కామాక్షి ఆమెతో అత్తారింటికెళ్లిపోయే రోజున.

—"నాకు పెళ్లయినప్పటిమాటకదా!" అంది శీతాయి నిస్పృహతో, నిరాశతో, అసూయతో.

శీతాయిపెళ్లి గురించి కామాక్షి వెళ్లనవసరం లేకపోయింది. వెళదామనుకుంది గానీ, ఆమెపెళ్లి ఈలోకంలో కాదు!.... మాయలమారి స్ఫోటకం ఆమెను మరోదగ్గరకు తీసుకుపోయింది.





# మంచు తెరలు

(16-వ పేజీ తరువాయి)

కాలం. చివరకు ప్రసంగాన్ని రాధ ఉపక్రమించింది.

"ఏమండీ! మన పొరుగు శారద మొగుడు ఇవాళ రేవనుపాపునుండి పంచదార తెచ్చాడట. మరి, మీ రేం తేవటం మానేశారు?"

"అబ్బ! ఊరుకుందూ. ఏదో. ప్రశాంతంగా చదువుకొంటూంటే, మధ్యను సంసారం గొడవ తెచ్చిపెడతావు." అని పుస్తకాన్ని టేబిలుమీదకు గిరవాటు వేసి, కళ్లుమూశాడు విశ్వనాథం.

"పోనీలెండి. అసలు నా మాట లంటేనే మీకు చిరాకు. ఇంతకూ, నేను చేసుకున్న అదృష్టం గాకపోతే, ఈ దసరాపండక్కి నాకో మంచిచీరైనా కొన్నారూ? ఏమైనా అంటే - కస్సుమనిలేస్తారు మళ్ళీ." అని, తనలో సగం చచ్చిన ఉత్సాహాన్ని వెళ్లగక్కింది రాధ.

విశ్వనాథం మాటాడకుండా, నిద్రపోవటానికి ప్రయత్నిస్తున్నాడు. రాధగూడ మౌనంగా దేన్నిగురించో ఆలోచిస్తూంది. ఎందుచేతనో వాతావరణం బరువెక్కినట్టు తోచి, మంచంపైన దొర్లట మారంభించాడు విశ్వనాథం.

"ఏమండీ! నిద్రపోతున్నారా?" అంది రాధ; నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

"ఉహూ! ప్రయత్నిస్తున్నా."

"అన్నట్టు - చెప్పటం మరచాను. శారద మొగుడు, దానికి దసరాకు మంచి నీలం పొడి ఉంగరం చేయించాడు సుమండీ!" అని మెల్లగా మంచంమీదనుంచి లేచింది రాధ. ఎందుకో ఉలిక్కిపడ్డాడు విశ్వనాథం.

"అయితే?"

"అదికాదు. మీరు ప్రతిదానికీ చిరాకు పడితే చెప్పలేనుగాని, నాకూ అట్లాంటి వుంగరం పెట్టుకోవాలని వుందండీ." అంటూ విశ్వనాథం మంచంమీదకు పోయింది రాధ.

మగవానిని లాలించటంలో, సహజత్వంతోపాటు అనుభవంచే అలవర్చుకున్న నేర్పును, రాధ ప్రయోగింపదలచినట్టుగా వుంది. ఆమె రాక తనలో ఏమంత ఉత్సాహాన్ని రేకెత్తించకపోయినా, తప్పనిసరి మల్లే మంచంమీద రాధకు చోటిచ్చాడు విశ్వనాథం.

"అయితే-ఉంగరం మానేమి టంటారు? పోనీ, డబ్బు లేదనుకుందామంటే, మొన్న నే పేపర్లు దిద్దిన డబ్బు వచ్చిందిగా. అందులోంచి పెట్టి నాకో ఉంగరాన్ని చేయించండి."

"మాడ్దాంలే. ఇంతకూ, అడబ్బు ఉంగరాలకూ, ఊళ్ళకూ తగలెడితే, ఊర్లో బాకీలెవరు తీరుస్తారు?" అని ఆమె కోరికకు చిన్న పేచీ అడ్డువేశాడు విశ్వనాథం.

వెంటనే చిన్నబుచ్చుకున్న మొహంతో,

"పోనీయండి. మీ కంతగా డబ్బు పెట్టటానికి కష్టంగావుంటే, నా చంద్రహారాల్లో ఒకపేట తీయించి, ఉంగరం చేయించండి. శారద తన ఉంగరాన్ని చూపుతూ, ఎంతని గొప్పలు చెప్పుకుందనుకున్నారు." అంది, అతని క్రాపింగును సరిదిద్దుతూ రాధ.

"పడుకుందూ - చాలారాత్రయింది. రేపాలోచిద్దాంలే -.ఉంగరం గురించి!" అంటూ ముక్తసరిగా జవాబుచెప్పి ప్రక్కకు తిరిగాడు విశ్వనాథం.

ఎందుకో ఉంగరంపేరు, శారదపేరు అతని చెవులలో బడేసరికి, అతని గుండెల్లో విమానాలు పరువులెత్తసాగాయి.

ఇంతసేపాయి తనని మథన పెడుతూన్న ఉద్రేకాన్ని ఆపుకొని,

"పోనీయండి - ఇప్పుడు చేయించటం ఇష్టంలేకపోతే, పెళ్ళినాడు మా నాన్నగారు మీకు పెట్టిన ఉంగరాన్ని నా కివ్వండి. నా సరదా తీరేవరకూ, నాచేతిని వుంచుకుంటాను." అని భర్త కుడిచేతివ్రేళ్ళలో తన వేళ్ళని నుంచింది రాధ.

ఒక్కసారిగా కొన్ని కోట్ల భూతాలు తన్ను వెంటాడుతూన్నట్టు వణికాడు విశ్వనాథం. కాని, వెంటనే తమాయించుకుని, ఆమె చేతిలోంచి, తన చేతిని తప్పించుకున్నాడు.

"ఏమండీ! ఉంగరంలేదేం - వేలిని?" అంటూ, ఆశ్చర్యంతో తిరిగి అతని వేలిని పట్టుకుంది రాధ.

"ఆ! అన్నట్టు - ప్రొద్దున్న విజయుడు, తానొక ఉంగరం అల్లాటిదే చేయించుకో దలచి, నమూనా చూపటానికి తీసుకెళ్లాడు." అని కొద్ది తడబాటుతో చెప్పాడు విశ్వనాథం. ఎంతయినా స్కూలుమాస్టరు గద బళ్ళోని పెంకిపిల్లవాళ్ళ డొంక తిరుగుడు ప్రశ్నలకు, అనుబంధప్రశ్నలకు, సమాధానాలు చెప్పటంలో ఆరితేరిన ఘటం అగుటచే సర్దుకోగలిగాడు.

రాధమాత్రం అతని ఆతురతలోని అపసవ్యాన్ని వెంటనే గ్రహించి, అణుమాత్రం గాకూడా చలించక, "ఆ! అన్నట్టు చెప్పటం మరచా. శారదకు తానో గొప్ప అందకత్తెననీ, దానిమొగుడు దాని పాదాలు కందనీయకుండా పరిచర్య చేస్తాడనీ, ఇతర స్త్రీలనైపు కన్నెత్తి చూడడనీ, ఏం గర్వం అనుకున్నారు." వ్యంగ్యంగా ప్రసంగాన్ని ముందుకు తీసుకుపోయింది.

"ఉహూ!"

"అంతేగాదు - ఊర్లోని ప్రతి మొగవాడూ దాని అందానికి మురిసిపోయి, ఇంటిచుట్టూ కుక్కలమల్లే తిరుగుతుంటారట. అందులో.. ..."

"అబ్బా! నోరుమూసుకుందూ. వాళ్లెల్లా గెడిస్తే మనకేం." అంటూ రాధనోటిలోని వాక్యం పూర్తిగాకపూర్వమే ఎందుకో వారించాడు విశ్వనాథం.

విశ్వనాథంకంగారునకు వచ్చిన నవ్వును రాధ ఆపుకొని,

"అయితే - నే నెవరిగురించో చెబుతూంటే, మధ్యను మీ రెందుకిల్లా శివం పూనినట్టు నామీద కేకలు వేసుకొని లేస్తారు? దొంగకు తేలుకుట్టిన సామెతలా వుంది మీ వ్యాపారం. పోనీలెండి - ఇక నాకే వుంగరం అక్కర్లేదు. ఇంతకూ నా కర్మ ఇల్లా వుంటే, మిమ్మల్ని అనేమి ప్రయోజనం" అని, చిన్నగా రాగాలాపనకు మొదలుపెట్టింది.

పూర్తిగా అర్థమయింది విశ్వనాథానికి; రాధ ఈ అరగంటయి తన ప్రసంగాన్ని దేనిమీదను కేంద్రీకరిస్తున్నదో. ఆ కారణంచే, ఇక ఆమెను లాలించి లొంగదీసుకోకపోతే, తాను అగాధంలోకి పోవలసి వస్తుందని, వెంటనే "ఏంటి - రాధా! అనవసరంగా చిలిపి జట్టీ పెంచుకొని, నిండింట్లో తీరికగా రాత్రి భాగాన ఏడుపునకు కూర్చున్నావ్?" అని బుజ్జగింపుగా, ఆమె చీరకొంగును తన చేతికి చుట్టుకొన్నాడు విశ్వనాథం.

ఈ లాలింపు రాధలో ఏమీ పనిచేయలేదు. తరతరాలై, స్త్రీ లందరిలోనూ తొక్కియుంచబడిన ఆత్మాభిమానం, ఆమె రక్తాన్ని మేల్కొలిపి ప్రజ్వలింపజేసింది.

"ఏమన్నారూ! చిలిపిజట్టీ నే పెడుతున్నా నంటారా? పాపం! నా జీవితానికే చిచ్చు పెట్ట తలచేరే మీరు?" అని, ఆవేశంతో తన జాకెట్లో దాచివుంచిన నీలంపొడి ఉంగరాన్ని బైటకు తీసి, "దొరగారు ఈ ఉంగరాన్ని ఎవరికి బహుమానంగా యిచ్చారో తెలుసుకోవచ్చా? ఇక, మీ రిల్లాంటివా రవుతారని, నే కల్లోకూడా అనుకోలేదు." అని, అతని కళ్ళకు దగ్గరగా ఉంగరాన్ని వుంచింది రాధ.

విశ్వనాథం మాట్లాడలేదు. మేఘాల్లో దాగివున్న పిడుగు లన్నీ ఒక్కసారిగా అతనిమీద పడినట్లుగా కుంచించుకుపోయా

డతను. కొన్ని క్షణాలపాటు అతని కళ్లు చీకట్లు కమ్మాయ్.

రాధ తన ఆవేశాన్ని అదుపులోకి తెచ్చుకొని, విశ్వనాథం మొహంలోని పరివర్తనలను గమనిస్తూంది. "రాధా! ఏదో - తెలియక కాలుజారింది, క్షమించగలవా?" అంటూ చెంపలమీది కళ్ళనీళ్ళతో, ఆమె చేతులను తన నుదిటిమీదకు తీసుకొని, "శారద యిచ్చిందా - ఈ ఉంగరాన్ని?" అని, బొంగురుపోయిన గొంతుతో అడిగాడు విశ్వనాథం.

"అవును. సాయంకాలం శారద మాయింటికి వచ్చి, ఈ ఉంగరాన్ని నాకిస్తూ, మీ రేదో మహాపరాధం చేసినారల్లే గోసి చేసి చెబుతూంటే, నాకు తలను కొట్టేటంత బాధ అనిపించింది. ఇంతకూ, ఎన్నడూ లేందీ, ఇప్పు డెందుకూ మీ కిల్లాంటి పన్లు?" అంటూ భర్త క్రాపింగును సరిచేసి, అతని గుండెల్లో మొహాన్ని దాచేసుకుంది. అంతే రాధకు - తెలుసు తన భర్త ఎటువంటివాడో - ప్రమాణాలవల్ల కాలుజారట మంటే ఏమిటో.

*   *   *   *

"ఏం రాధా! ఇల్లావచ్చావ్?" అని జడ వేసుకొంటూన్న శారద, అద్దంలో నే రాధ ప్రతిబింబాన్నిచూసి ప్రశ్నించింది.

"ఏం లేదు - అక్కా! బావగా రింట్లో లేరుగద?" సిగ్గును వ్యక్తపరుస్తూ ప్రశ్నించింది రాధ.

"లేరులే. కూర్చో - అల్లా సోఫాలో. అయితే - రాధా! ఉంగరాన్ని నీ కిచ్చిన నాటినుంచీ మాయింటికే రావటం మానేశావేమే? కోపంగాని వచ్చిందా ఏమిటి?"

రాధకు ఆ ప్రశ్న బాధగా తోచినా "కోపం దేనికి - అక్కా! తప్పు మావారిదేగా. ఇంతకూ, నేను మీ యింటికి రావటం మాని, వారంరోజులేగా అయింది. ఏదో ఇంట్లోని పనుల్లో కొట్టుకుపోతున్నాను." అని, సోఫాలో కూలబడింది.

"అహా! ఏమో కోపంగాని తెచ్చుకున్నావేమోనని, నే అనుకున్నాలే. కాని నీ మొగుణ్ని ఆవాళ గట్టిగా చీవాట్లేశావా లేదా? చూడు - రాధా! ఈ మగవాళ్ళకు మెళ్ళో కళ్ళేలు తగిలించి నడుపుతూ వుంటేనే, లేకపోతే ముళ్ళకంచెల్లోకి పోతారు - తెలిసిందా. ఇంతకూ నా అదృష్ట మేమిటోగాని, మావా రల్లాంటివారు కారుసుమా. పైగా నేనంటే ఒళ్లూ పయీ మరచిపోతారుగూడా." అంటూ గర్వంతో, తన అందాన్ని తానే త్రాగేసే దానికి మళ్లీ అద్దంలో చూసుకోవట మారంభించింది శారద.

రాధ తన మొహంలో చేరిన అసహ్య భావాలను, దాని ముడుతలలోనే దాచి వుంచేసింది.

"అవును - అక్కా! నే చూస్తున్నాగా బావగారి సంగతి. నిజంగా అదృష్టం గురించి చెప్పాలంటే, నిన్నే ముందు

చెప్పాలి." అని, కొద్దిసేపాలోచించి, "అక్కా! నాకు నాలుగురోజులయి, ఒక సమస్య పట్టుకుని వేధిస్తూంది. నువ్వు దాన్ని విడదీయగలవేమోనని నీ దగ్గర కొచ్చా" నంది రాధ. ఆ మాటలతో ఒక్కసారిగా శారదహృదయం ఉప్పొంగింది. "ఏమిటది రాధా, కొంపతీసి యేదైనా ప్రేమకు సంబంధించింది కాదు కదా!" అని నవ్వుతూ జడలో గులాబీలను తురుముకొని, రాధవేపు తిరిగింది శారద.

రాధ ఒక వెడనవ్వును నవ్వి, "ఇంచుమించు, అల్లాంటిదే - అక్కా! కాని, దానిని నీకు చెప్తే, నా సమస్యను విడదీయటానికి బదులుగా ఉద్రిక్తురాల వవుతావేమో నని నాభయం." అని చిన్న వ్యంగ్యాన్ని విసరింది రాధ.

పరిస్థితిని అర్థంచేసుకోలేక, శారద "అబ్బ! ఏమిటే! ఏదో గొడవపెట్టి విసిగిస్తున్నావ్. ఆ చెప్పేదేమిటో, నాన్చక వేగం చెప్పేయరాదూ," అని కుతూహలంతో గూడిన విసుగుబాటును కనపరచింది.

రాధ ఆమె ఆత్రుతను జూసి, వచ్చే నవ్వును పెదాలలోనే అణచుకొని సిగ్గు నటిస్తూ, "బావగారొచ్చే వేళయింది - శేషాచ్చి చెప్తానులే." అని సోఫాలోంచి లేచి ద్వారంవేపు పోయింది. కాని, వెంటనే శారద, రాధ నాపి, "పిచ్చిపిల్లా! మీ బావగారిదగ్గర సిగ్గెమిటే! అతను నీ మొగుడికిమల్లే, గంగెలామనిషి కాదులే. అయితే, ఇంతకూ నీకా సమస్యను కల్పించిన ప్రేమారాధకు డెవ్వరో చెప్పు - వింటాను." అంటూ సోఫామీదకు తీసుకుపోయిందామెను.

ఆడపులిలా కూర్చున్న రాధ, రాబోయే ప్రళయానికి నాందీప్రస్తావన ప్రారంభించింది.

"అయితే - విను. నాలుగురోజుల క్రిందట, ఒకతను మాయింటి గుమ్మందగ్గరే తచ్చాడుతూంటే చూసి, నా కెందుకని వూరుకున్నా. కాని, ఈ నాలుగురోజుల లోనూ, అతని ప్రవర్తన మితిని మీరింది. మావారికి విషయం చెప్పుదామనుకుంటూండగా, ఇవాళ మధ్యాహ్నం గదిలో నేను పడుకొనివుంటే, కిటికీగుండా ఒక చీటీ, ఒక చిన్న లాకెట్ నామీద పడ్డాయి. త్రుళ్ళిపడి చూసేసరికి, అతను కిటికీదగ్గర నిలబడే వున్నాడు. కాళ్లు వణుకుచ్చుకుంటున్నా, వెంటనే కిటికీ తలుపులు మూసేశా. ఇదీ జరిగిన సంగతి." అంటూ తన వుపన్యాసాన్ని ఆపివేసింది రాధ.

ప్రతీ చిన్నవిషయానికీ ఇట్టే తుపానుమల్లే కోపాన్ని తెచ్చుకునే శారద, ఆవేశంతో, "ఎవడే - అతను? పళ్లు రాలగొట్టేయలేకపోయావ్వూ? ఇంతకూ, ఆ చీటీ. ఆ లాకెట్, ఇక్కడకు తెచ్చావా? తెస్తే ఇల్లా యియ్యి - చూస్తాను." అంటూ రాధవైపు చెయ్యి చాపింది.

మొదట రాధ హృదయం వణికింది - ఏం ఉప్పెన వస్తుందోనని. కాని ఆమెలోని ఈర్ష్య, శారద తనభర్తను ఆడిన అవమానపు మాటలూ, ఆమె భయాన్ని, ఛిన్నాభిన్నం చేశాయ్.

"నువ్వన్నదే నిజం - అక్కా! కాని, పళ్లు రాలగొట్టేసేముందు, నీ సలహా తీసుకుంటే మంచిదేమోనని వచ్చా. ఇదిగో - వీటిని చూడు." అంటూ తాను తెచ్చిన వుత్తరాన్ని, లాకెట్‌ను శారదచేతిలో వుంచింది రాధ.

ఆత్రుతతో ఉత్తరాన్ని చదవసాగింది శారద; ఆ మహానుభావుని నామధేయాన్ని తెలుసుకుందామని. అంతే. క్రిందిసంతకం "సుందరం" అని చూచేసరికి, తన కాళ్ళ క్రింద నున్న భూమి కంపిస్తూన్నట్టూ, తన ముందున్న వస్తువులు వలయాకారంలో తిరుగుతూన్నట్టూ తోచిం దామెకు. ఆమె మొహాన్ని చెమటలు ఆక్రమించాయ్.

తనవాడనుకున్న, "సుందరం" తన ప్రేమలో మునిగి తేలుతున్నవాడు, ఇల్లా అతి నీచంగా ప్రవర్తించి, తన ఊహాసౌధానికి చిల్లిని పెట్టి, తన గర్వానికి, ఆత్మగౌరవానికి దెబ్బ కొడతాడని, శారద కలలో గూడా అనుకోలేదు. ఇకను, తనకన్న అందంలో, అనుభవంలో ఎన్నో మెట్లు దిగువనున్న ఈ చిన్నపిల్ల "రాధ" తనకు ఇల్లా పరాభవాన్ని జరుపుతుందనీ, తానామెచేతులు పట్టుకొని క్షమార్పణ వేడవలసి వస్తుందనీ, ఆమె ఏ పరిస్థితులలోనూ ఊహించియుండలేదు. మరీ, ఆమె ఊహాల కవతలవున్న మానవప్రకృతి, అందులో మగవాని మనస్తత్వం, ఆమె మనస్సుని లేశంగానైనా ఎన్నడూ తాకియుండకపోవుటచే, ఆమె అవమానానికి దాసురాలయింది.

రాధ విజయోత్సాహంతో దూరానవున్న అద్దంలో తన మొహాన్ని చూసుకుంటూ, "ఒస్తాను - అక్కా! మరి, బావగారి కెల్లాంటి రకం కళ్ళెలు బిగిస్తావో." అని సోఫాలోంచి లేచింది.

చెంపపెట్టులా తగిలిన ఆ వ్యంగ్యాన్ని మింగుతూ, పరధ్యానంగా,

"ఈ మగవాళ్లందరూ, ఇల్లాగే కామోసు!" అని, బరువెక్కిన కళ్ళతో "రాధా! తెలియక నీ భర్త నేమేమో అన్నా - క్షమిస్తావా?" అంటూ రాధ చేతులను తన ఒడిలోకి తీసుకుంది శారద.

ప్రతీకార వాంఛచే నలపబడి, తర్వాత కలిగిన విజయోత్సాహంలో తేలిపోతూన్న రాధ హృదయాన్ని, స్త్రీ సహజమైన జాలి ఒక్కసారిగా ఆక్రమించింది.

"క్షమించు - అక్కా! నిజానికి ఈ పాపం నాది. నువ్వు, నాకూ నాభర్తకూ చేసిన అవమానంచే ఏర్పడిన ప్రతీకార వాంఛతో మండే హృదయాన్ని అరికట్టలేక, నీ గర్వానికి దెబ్బ కొడదామన్న తలంపుతో, మూలకూర్చున్న బావగారిని రెచ్చగొట్టాను. పాపం! మగవాడు - అతనేంచేస్తాడు. హృదయసంరంభాన్ని ఆపుకోలేక, నాలుగురోజులలో బహుమానంతో తయారయ్యారు. ఇంతకూ, మనవల్ల ప్రత్యాకర్షణ లేందీ, ఏ మగవాడూ వీధిని పడడనుకో. ఇక, నేను నిన్నిప్పుడు ప్రార్థించే దేమిటంటే, ఏదోషం ఎరగని ఆ అమాయకుని దండించవద్దని." అంటూ నీళ్లచే నిండిన కళ్లతో, శారద కళ్ళలో చూసింది రాధ." అంతే - ఇద్దరి హృదయాల్లోని మంచుతెరలు తొలగిపోయాయి.

ఎదుటింటివారి రేడియోలోంచి "రాధ కెందుకు నవ్వు - చెల్లెలా!" అన్న కృష్ణశాస్త్రి గేయం వినబడుతూంది,

---



"శ్రమ విజయం

కథానిక:

# నామకరణ మహోత్సవం

రచన:

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

"ఇక నామకరణమహోత్సవము. ఏం నామకరణము చెయ్యదల్చుకున్నారో చెప్పండి. ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. నక్షత్రాన్నిబట్టి నామకరణంలో 'భ' అనే అక్షరము వుండాలి. పెద్దలు నిర్ణయించండి!"

"మీరు యేపేరు పెట్టినా, నాకు వెంకటేశ్వరస్వామి మొక్కుంది. మీకు తెలుసుకదా, అదిమాత్రం మరిచేపోకండి."

'వాళ్ల తాతయ్యపేరు పెట్టరూ?'

"ఎప్పుడూ పాతచింతకాయపచ్చడేనా? క్రొత్త పంథాలో నడవాలి పేరు. మరి యేంపేరు పెట్టిస్తావో, రామమూర్తీ! నా వుద్దేశం స్వరాజ్యం వచ్చినతర్వాత పుట్టాడుకాబట్టి 'విజయకుమార్' అని పెడితే బాగుంటుంది."

"మా కాలంలో యిలాంటి పేర్లు యెరగం. ఏదైనా దేవుడి పేరు వుండాలిగాని, యిదేమిటి?"

"నెహ్రూ, గాంధీ, యీ పేర్లల్లో యేదైనా పెట్టితే?"

"అది చాలా అనవసరం. వాళ్ల పేర్లు చెడగొట్టటమేగాని అంతకంటె యేమీ లేదు. అంత గొప్పవాడే అయితే, పేరు అడ్డం రాదులే. అదిమాత్రం పెట్టకండి. నాకేమాత్రం యిష్టం లేదు."

"పేరులో 'భ' వచ్చేటట్లు చూడండి."

"అమ్మా! మాస్టారే నిన్న రామరావణయుద్ధం పాఠం చెప్పాడే, దాంట్లో కుంభకర్ణుడు వచ్చాడు. ఆ పేరు పెట్టితే 'భ' వస్తుందిగా!"

"ఛ! వెధవ! నోరు ముయ్యి! యింకా వాళ్లు విన్నారుకారు. తప్పు. అట్లా అనకూడదమ్మా."

"ఏం, మామగారు యేమీ మాట్లాడటం లేదు. ఏమిటి మీ సలహా?"

"పేరులో యేముంది, యేదో వకటి పెట్టెసెయ్యండి. పెద్దవాళ్లయినతర్వాత వాళ్లకు నచ్చకపోతే యెలాగో మార్చుకుంటారు. మనం పెట్టిన పేర్లు వుంచుతారా, పెట్టుతారా? మా మేనల్లుడికి సీతాపతి అని నిక్షేపంలాంటి పేరు పెట్టితే, కాలేజీలో 'సుఖదేవ్' అని వ్రాయించుకున్నాట్ట. మాకేం తెలుసూ? సుఖదేవ్ వున్నాడా అని మొన్న ఒకాయన వస్తే యీ చుట్టుప్రక్కల లేడని చెప్పా!"

"అవును, రామలింగేశ్వరప్రసాదమూర్తి అని పెట్టాము మన ప్రసాద్‌కు, కాలేజీలో అందరూ రామమూర్తి అనే పిలవటం. మనకు ప్రసాద్ అంటేగాని తెలీదు కదా, మొన్న మావాడు కాలేజి వెళ్లి, రిజిస్టర్లన్నీ వెతికితే ప్రసాద్ వుంటేగా? కొంపతీసి వీడు కాలేజీలో చేరాడా, లేదా అనిపించింది."

"అసలు యిదంతా కాలేజీచదువుల్లో వుందండి."

"ఒకవిషయం మాట్లాడుతుంటే, యింకో విషయంలోకి పోతారే! ముందర పేరేమిటో తేల్చండి. తర్వాత కాలేజీలగురించి చర్చిద్దాము."

"పెద్దవాళ్లం మేము వున్నాముకనక నామకరణం చెయ్యటం మా విధి. తర్వాత వాళ్ల యిష్టం."

"ఇప్పుడు యీ నక్షత్రాలూ, యివన్నీ యెవరు చూసొచ్చారు? పిల్లవాణ్ణిబట్టే పెట్టితే సరి పేరు."

"అట్లా అవుతే 'హనుమంతయ్య' అని పెట్టండి చక్కగా సరిపోతుంది."

"ఆహా! ఏ అమ్మ, వదిన! మా చిట్టికి మా అన్నయ్యపోలిక వచ్చిందికాబట్టి సరిపోయిందిగాని, లేకపోతే యెంత లక్షణంగానైనా వుండేవాడు! నువ్వుకూడా ఆక్షేపించాలీ?"

"బళ్లో వేసినాకూడా యింకా చిట్టేమిటి? పేరు పెట్టి చెప్పరాదూ?"

"రంగునబట్టి అయితే నీలమేఘశ్యాముడు."

"శ్రీరామచంద్రమూర్తి రంగు ఇంకే!"

"ఆఁ, పోలిక్కేమీ లోపం లేదు."

"నడుములు పీక్కుపోతున్నాయి."

"మరి యేం చెయ్యమంటావు? నువ్వే చెప్పు యేదో వక పేరు."

"శ్రీ వెంకటసాయీకృష్ణరంగనాధరావు"

"ఓహో! సాయిబాబ భక్తుడుగామాలు."

"రావు యేమిటి రావు, శాస్త్రి. శర్మో వుండాలిగాని చివర, ఎంత తోస్తే అంతేనా?"

"సాయీనాథ్!"

"వెంకట వచ్చింది కదా! వెంకటేశ్వరస్వామి రక్షించు."

"సత్యనారాయణస్వామికి మొక్కుకున్నాంకదా మరి.."

"వేదాద్రి వెళ్లివచ్చామూ, దాని మాటేదిరా? నిమిషంలో ముగించావు!"

"ఎంత చేస్తే యింత అయ్యారు! తాతగారు పోతూపోతూ తనపేరు పెట్టమని చెప్పారు! వీసమంతైనా లక్ష్యముంచావూ! రామ అనే శబ్దం తగిలిస్తే వారి పేరుకూడ వచ్చేదా! అంత మరుపా మరీ?"

"ఏమండీ, పిల్లవాడు పుట్టితే, 'మోహను' అని పెట్టదాము అనుకున్నాంకదా, మరిచేపోయ్యారా?"

"ఆధునికంగా వుండాలంటే-సాయీనూ, నాయీనూ!"

"నోరుముయ్, సాయిబాబానే అంటున్నావే!"

"ప్రొద్దుపోతోంది. ఎదోవకటి నిశ్చయం చెయ్యండి. ఇప్పటికే చాలా కాలాతీతమైంది."

"ఏమిటండీ మీకు తొందర? ఇవ్వాళ ప్రొద్దుపోతుంది. రేపు ప్రొద్దుపోతుందా?"

"ఒరే రామమూర్తీ, చివర శాస్త్రీ, శర్మ, అని తగిలించకండి, యీ రోజుల్లో చాలా తంటా వస్తుంది. చూస్తున్నాంగదా మనము!"

"అవుతే 'రెడ్డి' అని పెట్టమంటావా? లేకపోతే నువ్వు చెప్పేది యెట్లా వుంది? అంత వుద్యోగమే యివ్వకపోతే, ఇంత విజ్ఞానము వున్నవాళ్లు యెక్కడో అక్కడ పొట్ట పోసుకుంటార్లే, ఒక డిచ్చే దేమిటి?"

"ఎప్పటి మాటలో యిప్పుడెందుకండీ?"

"అది కాదు మామయ్యా, యిప్పుడు పరిస్థితులు యిట్లా వున్నాయని మెల్లిగా చెప్తుంటే అంత నామీద లేస్తాడే. నేను ఆమాత్రం అరవలేననా?"

"వూరుకో, నాయనా, వూరుకో. ఈ కాసేపు అవనీ, అంతా అయినతర్వాత కంత అప్పడాలని!"

"ఏంపేరు పెట్టుకుంటే యెవరిక్కావాలి? వస్తారా, రామమూర్తీ."

"ఒరేయ్!..."

"లేకపోతే వీరుల పేర్లు పెట్టితే, శివాజీగాని, రాణాప్రతాప్ గాని?"

"పోరా, ఆర్. యస్. యస్ మొహం! నువ్వుకూడ సలహాలా?"

"నేను చెప్తున్నా, వెంకటసత్యనారాయణ లక్ష్మి సాయీరామమోహనరంగ శాస్త్రి."

(45-వ పేజీ చూడండి)




బాలగేయం:

# మహాయోధుడు

'మధుశ్రీ'

అమ్మా! నువ్వూ నేనూ ఎక్కడికో
ప్రయాణమై పోతున్నా మనుకో.
నువ్వు మేనాలో కూర్చునుంటావు;
నేను గుర్రంపై స్వారీ చేస్తుంటాను.

ఎటు చూసినా అంతా ఎడారి,
చాలా అపాయకరం ఆదారి,
సూర్యు డస్తమిస్తుంటాడు కొండల్లో
నీకు భయం పుడుతుంది గుండెల్లో.

మరి మాటిమాటికీ నువ్వేమో
అంటావు. "దోవ తప్పి వచ్చామేమో?"
"భయపడకమ్మా! నే నున్నాగా."
అంటాను నేను ధైర్యంగా.

మనం చేరుకుంటా మింతలోకి
దట్టమైన అరణ్యం లోకి.

అప్పటికి బాగా చీకటిపడుతుంది;
ఆ చీకటి నిన్ను భయపెడుతుంది.

నువ్వులిక్కిపడతావు హఠాత్తుగా,
"ఆ వెల్తు రేమి" టంటావు నెమ్మదిగా
దూరంగా వినిపిస్తా యేవో కేకలు,
పరుగెత్తుకొస్తారు దొంగలమూకలు.

నువ్వుహనుమంతుణ్ణి స్మరించుకుంటావు
"ఈ గండం గడిస్తే..."అనుకుంటావు,
"భయపడకమ్మా! నే నున్నాగా"
అంటాను నేను ధైర్యంగా.

దెయ్యాల్లా జుట్టు విరబోసుకుని
దొంగ లొస్తారు కర్రలు తీసుకుని.
నే బెదిరిస్తాను-"ప్రాణంపై తీపివుంటే
పారిపోండి... వచ్చారంటే..."

వాళ్లరుస్తూ ముందు కురుకుతారు
మేనాబోయీలు పారిపోతారు
కత్తి లాగి మెరుపులా ఝుళిపిస్తాను
గుర్రాన్ని వాళ్లపై కురికిస్తాను

నాకూ దొంగలకీ యుద్ధం జరుగుతుంది.
వాళ్ల రక్తం కాలవలు కడుతుంది
చచ్చినవారు చావగా మిగతావారు
తలో దిక్కూకూ పారిపోతారు.

నువ్వు మేనాలో వణుకుతూ కూర్చుని
అనుకుంటావు నేను చచ్చిపోయానని.
ఇంతలో "యుద్ధమైపోయిందే" అంటూ
వస్తాను నేను పరుగెత్తుకుంటూ.

నువ్వు మేనా దిగి నన్నెత్తుకుని
అంటావు ముద్దుపెట్టుకుని-
"ఇవ్వాళ పాపాయిగనక లేకపోతే
ఎంతో ప్రమాదం జరిగేదే!"

రోజూ ఎన్నో అర్థం పర్థం లేని
పిచ్చివిషయాలు జరుగుతాయిగాని,
ఇల్లాంటి దెప్పుడన్నా జరిగితే
పుస్తకంలో కథల్లా వుంటుంది కదే?

మన వూళ్లో వాళ్ళీ కథంతా విని
ఆశ్చర్యంతో ముక్కుమీద వేలేసుకుని
అంటారు- "పాపాయి పక్కన లేకపోతే
ఆవిడ కేదో అపాయం జరిగేదే."

[మూలం : టాగూరు]






బరోవైపుకి వెళ్లిన టామ్, జోలు ఎంతసేపటికీ తిరిగి రాలేదు. హక్ చాలసేపు ఎదురుచూసి వాళ్లని వెదుక్కు రావటానికి బయల్దేరాడు. ఇద్దరూ గాఢంగా నిద్రపోతున్నారు. మొహాలు పాలిపోయి వున్నాయి.

ఆ రాత్రి భోజనాలు చేసేటప్పుడు మామూలుగా హుషారుగా ఉండే టామ్‌గాని, జోగాని కిక్కురుమనలేదు. నిశ్శబ్దంగా తిన్నారు. తరవాత హక్ తనొక చుట్ట చుట్టకున్నాడు. వాళ్లకి కూడా చుట్టిపెడతా నన్నాడు. వాళ్లు వద్దంటే వద్దు పొమ్మన్నారు. వంట్లో బావు ల్లేదని, బహుశా మధ్యాహ్నం తిన్నతిండిలో ఏదో జబ్బు సరుకు కలిసి వుంటుందనీ అన్నారు.

అర్థరాత్రప్పుడు జో లేచాడు. మిగతా వాళ్లని లేపాడు. చుట్టూ అడివంతా నిశ్శబ్దంగా, చీకటిగా వుంది. ఆకాశంలో ఒక్క నక్షత్రం కూడా కనిపించకుండా మబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి. ముగ్గురూ దగ్గిర దగ్గిరగా మంట పక్కన చేరి కూర్చున్నారు. ఏదో మహాపద రాబోతున్నట్టుగా అనిపించింది.

ఇంతలో ఒక మెరుపు మెరిసింది. అడివిలోని ప్రతి చెట్టూ, పొదా స్పష్టంగా కనిపించాయి. మళ్ళీ ఇంకొక పెద్దమెరుపు చెర్నాకోలు 'ఝుంయ్' మన్నట్టు మెగిసింది. తరవాత వరసగా మూడు మెరుపులు గొప్ప తాచుపాముల్లాగా ఆకాశం మీద జరిగి పోయాయి. చలిగాలి సాగింది. 'ఢమఢమ' మని ఉరుములు వినిపించాయి. ఇంతలో ఢాం మని పెద్ద పిడుగు ఎక్కడో పడింది. పెద్దపెద్ద వర్షం చుక్కలు కురవటం ప్రారంభించాయి.

"పదండి, డేరా దగ్గిరికి" అని అరిచాడు టామ్.

ముగ్గురూ ముందు కురికారు. పొదలు, కొయ్యదుంగలు దాటారు. చీకట్లో చెట్లకి ఢీకొట్టారు. మెరుపులు, ఉరుములు గబగబ వస్తున్నాయి. పెద్దవర్షం కురుస్తోంది. ఎలాగతేనేం డేరాకి చేరుకుని, లోపలదూరి ఒకళ్లనొకళ్లు పట్టుకుని కూర్చున్నారు. ఇంతలో ఆ గాలికి డేరాగా కట్టిన తెరచాపగుడ్డ కాస్తా ముడులు తెంపుకుని ఎగిరిపోయింది. క్షణంలో వాళ్లు తడిసి ముద్దయిపోయారు. వెంటనే లేచి చేతులు విడవకుండా నదిఒడ్డునవున్న పెద్దమర్రి చెట్టు దగ్గిరికి పరుగెత్తారు. ఇంతలో ఇంకొక పిడుగు పడిం దెక్కడో. నది యావత్తూ సముద్రంలా పెరిగిపోయింది.

ఈ విధంగా తుపానువాన చాలాసేపు రేగింది. మాటమాటికీ ఎక్కడో పిడుగు పడటం, ఏ చెట్టో కూలిపోవటం వినిపించింది. జాక్సన్ ద్వీపానికీ, ఆకాశానికి యుద్ధం జరుగుతోందా, అనిపించింది. ద్వీపం ముక్కలైపోతుందా అనిపించింది.

చివరికి వాన వెలిసింది. గాలి తగ్గింది ఉరుములు మెరుపులు కొంతసేపు తమ ప్రతాపం చూపించినా చివరికి అవీ వెళ్లిపోయాయి.

మళ్ళీ తమ డేరా కట్టిన చోటికి వెళ్లారు. అక్కడ తమ కిన్నాళ్లూ నీడ నిచ్చిన చెట్టుకాస్తా వేళ్లతో

సహా కూలిపోయింది. ఆ సమయంలో తా మక్కడ లేనందుకు ఎంతో సంతోషించారు.

ఆ రాత్రి ఇక వాళ్లు నిద్ర పోలేదు. నిద్ర పోవటానికి స్థలమేదీ? నేలంతా తడిగానే వుంది. ఎల్లాగో తెల్లవారింది. అప్పుడు వెళ్ళి నది ఒడ్డునఇసకమీద పడినిద్రపోయారు. బాగా పొద్దెక్కేటప్పటికి వళ్లు చుర్రున కాలసాగింది. లేచి మళ్లీ వండుకున్నారు. రాత్రంతా నీళ్లలో నానారేమో ఇప్పటికీ వళ్లు బిర్రబిగిసి వుంది. ఏపనీ చెయ్యటానికి ఉత్సాహం లేదు. జో, హాక్‌లు మళ్ళీ ఇంటిమీద బెంగపడ్డారు. కాని టామ్ మళ్ళీ తన 'రహస్యం' జ్ఞాపకం చేసేటప్పటికి ఉషారు వచ్చింది.

అంతే కాదు; వాళ్లు భోజనం చేసింతరవాత చుట్టలుకాల్చారు. ఈసారి నిన్నటంత వికారంగా లేదు. నోట్లో ఉమ్మి కొద్దిగా ఊరింది కాని, డోకులుమాత్రం రాలేదు. దాంతో చుట్టలంటే మళ్ళీ ఉషారు పుట్టింది. నిన్నటిలాగే టామ్, జోలు డాబులు కొట్టడం మొదలు పెట్టారు. క్రమంగా వాళ్లకి చుట్టల మీద భయం తగ్గి భక్తి పెరిగిపోయింది.

* * * *

కాని ఏ శనివారంనాడు టామ్, జో, హాక్‌లు ప్రపంచాన్నంతా మరిచిపోయేంత ఉషారులో వున్నారో, ఆ శనివారంనాడే సెంట్‌పీటర్సుబర్గు గ్రామంలో అందరూ అంత విచారంలో వున్నారు. ఆ మర్నాడే చచ్చిపోయిన ముగ్గురికీ చర్చిలో కర్మకాండ జరుగుతుంది. ముఖ్యంగా జో హార్పర్ ఇంట్లోనూ, టామ్ సాయర్ ఇంట్లోనూ ఇంటిల్లిపాదీ ఏడుస్తున్నారు. స్కూలుకి ఆరోజున సెలవైనా పిల్లలు చాలామంది అక్కడ చేరారు. తమ స్నేహితులు చచ్చిపోయినందున ఎవళ్లూ ఉత్సాహంగా లేరు.

బెకీథాచర్ ఒకమూల కూర్చుని ఏడుస్తోంది.

"అయ్యో, అతన్ని జ్ఞాపకం ఉంచుకొనడానికి ఇప్పుడేమీ లేదు గదా! ఇక్కడేగదా మే మిద్దరం కోపా లొచ్చి విడిపోయింది! అదంతా మళ్ళీ జరిగితే అతనికి ఈసారి కోపం తెప్పిస్తానా! కాని ఏమనుకుంటే ఏం లాభం! పోయినవాడు పోనే పోయాడు." అనుకుంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

మిగతా పిల్లలు కూడా 'టామ్ ఇల్లా చేశా డల్లా చేశాడు. జో ఈ మా టన్నాడు, ఆ మాటన్నాడు.' అని స్నేహితుల్ని తలుచుకుంటున్నారు. ప్రతివాడూ తను ఆఖరిసారి వాళ్ల నెక్కడ చూశాడో వర్ణిస్తున్నాడు.

ఒకడన్నాడు. "సరిగ్గా నే నిప్పుడు నుంచున్న చోటే నుంచున్నాను. నా పక్కనే టామ్ నుంచున్నాడు. టామ్ ఎందుకో నవ్వాడు. నాకు వళ్లంతా జలదరించింది. ఎందుకు నవ్వాడో అప్పుడు తెలియలేదు. ఇప్పుడైతే తెలిసే దనుకో."

తరవాత వాళ్లలో వాళ్లకి పోటీలు వచ్చాయి. ఆఖరిసారి టామ్, జోలని ఎవరు చూశారని ప్రశ్న.' నేను ఆఖరిసారి చూశానంటే, నేను చూశా నని' పోటీలు పడ్డారు. ఆఖరిసారి వాళ్లని చూసిన గౌరవం సంపాదించటానికి చాలామంది ప్రయత్నించారు. కాని చివరికి ఆ గౌరవం ఒకడికి దక్కింది. అందరికంటే ఆఖరిసారి అతనే చూశాడని తేలింది. అతను గర్వంగా నుంచున్నాడు. మిగతా వాళ్ళకి అతని గౌరవంమీద ఈర్ష్య పుట్టింది.

ఒకడు అంతకంటే గొప్పగౌరవం సంపాదించాలని,

"టామ్‌సాయర్ నన్నొకసారి కొట్టాడుగా." అన్నాడు.

కాని ఈ గౌరవం లాభంలేకపోయింది. ఎందుకంటే అక్కడున్న వాళ్లలో చాలామంది టామ్ చేతులో తన్నులు తిన్న గౌరవం పొందినవాళ్లే.

ఆ మర్నాడు ఆదివారం. ఊళ్లో జనమంతా చర్చిలో చేరారు. చర్చి కిక్కిరిసిపోయింది. పోలీపెద్దమ్మ సిడ్‌ని, మేరీని వెంట బెట్టుకుని చర్చిలో ప్రవేశించింది. వాళ్ల వెనుక హార్పర్ కుటుంబంవాళ్లు వచ్చారు. వాళ్ళంతా విచారాన్ని సూచించే నల్లటి దుస్తుల్లోవున్నారు.

అందరూ నిశ్శబ్దంగా కూర్చున్న తరవాత ఫాదర్ లేచి నుంచుని

చేతులు చాచి దేవుణ్ణి ప్రార్థించారు. అందరూ నుంచుని ప్రార్థన పాట పాడారు. బైబిల్ పుస్తకాలు తెరిచి బిగ్గరగా కొంతభాగం చదివారు.

ఆ పిమ్మట ఫాదర్ చనిపోయిన ముగ్గురు పిల్లలనిగురించి ఉపన్యాసం యిచ్చాడు. వాళ్లు ఎంతో మంచివాళ్లు, వృద్ధిలోకి రావలసిన వాళ్లు అని, భగవంతుడిమీద భక్తి కలవాళ్లని వర్ణించాడు. అందరూ అలాగే అనుకోవటం ప్రారంభించారు. వాళ్లు బతికున్నప్పుడు చెడ్డ పిల్లలని తిట్టినందుకు, వాళ్లలోని మంచిని గ్రహించలేకపోయినందుకు తమ్మని తాము తిట్టుకున్నారు. ఫాదర్ ఉపన్యాసం ఆఖరయ్యే వేళకి ఎవ్వరికీ దుఃఖం ఆగలేదు. చనిపోయినవాళ్ల బంధువులతో పాటు అందరూ ఏడవటం మొదలెట్టారు. ఫాదర్ తన ఉపన్యాసం విని తనుకూడా ఏడ్చాడు.

ఇంతలో చర్చిబయట వరండాలో ఏదో చప్పుడైంది. కాని ఎవరూ గమనించలేదు. కాస్సేపటికి ఒకతలుపు తెరుచుకుంది. ఫాదర్ జేబురుమాలతో కళ్లు తుడుచుకుంటున్నవాడల్లా నిశ్చేష్టుడై పోయాడు. ముందు ఒకళ్లు, తరవాత యిద్దరు, తరవాత యావన్మందీ ఫాదర్ చూస్తున్న వేపుకే చూస్తూ ఒక్కపెట్టున నిర్ఘాంతపోయారు.

టామ్, జో, హాక్ ముగ్గురూ తలుపుదగ్గిర నుంచున్నారు. టామ్ ముందు నడుస్తుండగా మిగతా యిద్దరూ సిపాయీల్లాగ 'మార్చి' చేసుకుంటూ ఫాదర్ వున్న చోటుకి వచ్చారు.

దాంతో చర్చి అంతా గోలతో నిండిపోయింది. పోలీపెద్దమ్మ టామ్ మీద, జోతల్లి జోమీద పడి ముద్దులు కురిపించేశారు. అంతా చుట్టూమూగి ఊపిరాడనివ్వడం లేదు. పాపం హాక్ తనవాళ్లెవరూ లేకపోవడంమూలాన ఒకమూల నుంచున్నాడు దిగాలుగా.

"పెద్దమ్మా, హాక్‌ని చూసి ఎవరన్నా సంతోషపడాలి. లేకపోతే బావుండదు." అన్నాడు టామ్.

"అవును, పాపం. హాక్ బతికున్నందుకు నా కెంతో సంతోషంగా వుంది." అని వాణ్ణి బుజ్జగించింది పెద్దమ్మ.

ఫాదర్ గొంతెత్తి "భగవంతుడు ఇవ్వాళ మనపై ఇంత దయ చూపించినందుకు ఆయన్ని ప్రార్థించండి." అన్నాడు. అందరూ అలాగే ప్రార్థన చేశారు.

ప్రార్థనతో చర్చి మోతెత్తిపోతుండగా టామ్ దర్జాగా లాగు జేబుల్లో చేతులు పెట్టుకుని తనకంటే గొప్పవాడెవడన్నట్టుగా చుట్టూ చూశాడు. స్కూలుపిల్లలు కూడా టామ్‌ని మహానాయకుణ్ణి చూసినట్టుగా దూరంనుంచి ఈర్ష్యగా చూశారు.

టామ్ తన స్నేహితుల్తో చెప్పిన 'రహస్యం' యిదే; తమకోసం కర్మకాండ జరుగుతున్నప్పుడు వెళ్ళి ఎదటపడాలని, ఊళ్లో కెళ్లటానికి అదే మంచి సమయమని. ఆ పొద్దున్నే వాళ్లు జాక్సన్‌ద్వీపం నుంచి బయల్దేరి వచ్చారు.

టామ్ తను ఎల్లా పారిపోయిందీ, ఏమేమి సాహసాలు చేసిందీ సోమవారంనాడు యింటిదగ్గిర వర్ణించి చెప్పాడు.

పెద్దమ్మ అన్నది. "టామ్! నువ్వు పారిపోయినందుకు నాకేమీ కోపం రాలేదు. కాని చూశావా, నువ్వు చచ్చిపోయావని ఎంత దుఃఖపడ్డానో. 'చచ్చిపోలేదు' బతికే వున్నా' నని కాస్త నాకు తెలియపరిస్తే ఎంత బావుండేది? అవున్లే. నీ సరదాలో నేను నీకు జ్ఞాపకం వుంటానూ. నువ్వంటే నాకెంత ప్రేమో నీకు తెలుసా? నువ్వు పెద్దయిన తరవాత అనుకుంటావు. 'పెద్దమ్మ నన్నెంతో యిదిగా చూసేది గదా. ఆవిణ్ణి అప్పుడు నిర్లక్ష్యం చేశాను.' అని విచారపడతావు."

"కాదు పెద్దమ్మా. నిన్ను గూర్చి నేను కలకన్నాను."

"ఏమి టా కల?"

"కిందటి బుధవారం రాత్రి నాకు కలవచ్చింది. నువ్వు యీ మంచంపక్కన కూర్చున్నావుట. సిడ్, మేరీ ఆ కొయ్యపెట్టె పక్కన కూర్చున్నారుట."

"అవును. ఆ రాత్రి కూర్చున్నాము. అందులో వింత ఏముంది?" అంది పెద్దమ్మ.

"జో హార్పర్ తల్లికూడా ఇక్కడే కూర్చుందిట."

"అవున్రా, నిజమే తరవాత ఏం జరిగింది?"

"ఓ. ఇంకా చాలా జరిగింది. బయటినించి గాలి వచ్చి..."

(38-వ పేజీ చూడండి)



# ఊరికేనే

ఉజ్జయినీ నగరంలో మధుగుప్తుడని ఒక ధనవంతుడైన యువకు డుండేవాడు. కావలసినంత డబ్బుండటంచేత అతనికి ఏ పనీ చెయ్యవలసిన అవసరమే ఉండేది కాదు. బుద్ధి పుట్టినప్పుడు అందమైన బొమ్మలు గీసేవాడు; లేకపోతే కవిత్వం రాసేవాడు.

అతడు ఒకరోజున ఏమీ తోచక చచ్చిపోయాడు. అతన్ని ఇంద్రుడి రాజ్యమైన స్వర్గానికి తీసుకువెళ్ళటానికి బదులు, దేవదూతలు కుబేరుడి రాజ్యమైన యక్షలోకానికి తీసుకుపోయారు.

కుబేరుడు తన రాజ్యంలో ఎవర్నీ వొక్క నిమిషం సోమరిగా ఉండనిచ్చేవాడు కాడు. అందరూ ఏదోపని, అవసరమైన దాన్ని చేస్తూనే వుండేవాళ్లు. కుబేరుడికి కావలసిందల్లా డబ్బే. అతని ప్రజలంతా కష్టపడి పనిచేసి కుబేరుడికి ధనం చేకూర్చి పెట్టేవాళ్లు.

మధుగుప్తుడు యక్షలోకానికి వొచ్చాడు. అతడు పరమసోమరి. అందరూ ఎవళ్లపని వాళ్ళు చేస్తుండగా ఇతను పికార్లు కొట్టేవాడు. ఒకరోజున ఊరిబైట మంచినీళ్ల బావివద్ద నుంచుని వచ్చే పోయే వాళ్లని చూస్తున్నాడు. ఒక అందమైన దేవకన్య బుజాన కడవతో అక్కడికి వొచ్చింది.

"నీ పేరేమిటి?" అని అడిగాడు మధుగుప్తుడు.

"మధురలాలస" అన్నదామె.

"ఆ కడవ నొక్కమాటిస్తావా?" అని అడిగాడు.

"ఎందుకూ, మంచినీళ్లకా?" అన్నది.

"కాదు. దానిమీద బొమ్మలువేసి ఇస్తాను."

"బొమ్మలు దేనికీ?"

"ఊరికేనే"

ఈ 'ఊరికేనే' అనే మాట విని ఆమె ఆశ్చర్యపోయింది. యక్షలోకంలో ఎవరూ ఏ పనీ ఊరికే చెయ్యరు.

"నాకిప్పుడు తీరుబాటు లేదు. నేనింటికి పోయి బోలెడు పనులు చేసుకోవాలి." అని మధురలాలస విసవిస వెళ్లిపోయింది బుజాన నీటి కడవ నెత్తుకుని.

రోజూ మధుగుప్తుడు ఆ బావి వద్ద నిలబడి, ఆమె నడిగేవాడు ఆ కడవ నిమ్మని. ఒకరోజు విసుగెత్తి ఆమె ఇచ్చింది.

అతడు తీరిగ్గా ఆ పక్కన మామిడిచెట్టు నీడలో కూర్చుని కడవమీద పువ్వులు, పిట్టలు, బొమ్మలు ఇంకా ఏవో బొమ్మలు గీశాడు. రంగులు కలిపి కుంచెతో చాలా అందమైన చిత్రాలు వేశాడు.

"ఏమిటా బొమ్మలకి అర్థం?" అని అడిగింది మధురలాలస.

"వాటికి అర్థంలేదు."

ఆమె కడవ తీసుకుని యింటికి పోయి ఆ బొమ్మలకేసి చాలసేపు

దీక్షగా చూసింది. వాటి అర్థమేమిటో ఆమెకి తెలియలేదు.

ఇంకొక రోజున మధుగుప్తుడు మధురలాలసను చూసి "నీకు చక్కని పూలచెండు గుచ్చి పెట్టనా?" అన్నాడు.

"ఎందుకూ?"

"ఊరికేనే."

"పూలచెండుతో ఏం చేస్తారు?"

"తలలో పెట్టుకుంటారు."

ఆమె మళ్ళీ ఆశ్చర్యపోయింది. యక్షలోకంలో పువ్వులు పూస్తాయి గాని వాటికేసి ఎవరూ చూడరు; తలలో పెట్టుకోరు.

మధుగుప్తుడు గులాబీలు, చేమంతులు, సంపెంగలు కోసి చక్కని దండ గుచ్చి యిచ్చాడు. ఆమె దాన్ని యింటికి తీసుకుపోయి తలలో పెట్టుకుంది. అద్దంలో చూసుకుని యిదివరకెప్పుడూ తను ఇంత అందంగా లేనని అనుకుంది. అక్కడినుంచి రోజూ ఆమె తల దువ్వుకుని జడ వేసుకోవటం, పువ్వులు పెట్టుకోవటం మొదలైన పనుల్లో చాలా కాలం వృథా చేసేది.

మంచినీళ్ల బావివద్ద మధుగుప్తుడామెకి మంచిమంచి పాటలు మురళి మీద వినిపించేవాడు. ఆమె యక్షలోకంలో సంగీతం ఎప్పుడూ వినలేదు. ఈ పాటలు ఆమెకి బాగా నచ్చాయి. ఇంటికి పోయి ఆమె ఆ పాటల్ని సాధకం చేసేది.

కొంతకాలానికి కుబేరుడికి ఈ వర్తమానం తెలిసింది; తన రాజ్యంలో కొందరు పనులేమీ చెయ్యకుండా బొమ్మలు గీయటం,



పువ్వులు గుచ్చటం, పాటలు పాడటం మొదలైనవి, దమ్మిడీకి కూడా పనికిరాని అనవసరమైన పనులు చేస్తున్నారని గూఢచారులు ఆయనకి చెప్పారు.

"ఎవరు దీనికి కారణం?" అని కుబేరుడు మంత్రి నడిగాడు.

మంత్రి చెప్పాడు. "ఉజ్జయినీ నగరంనుంచి దేవదూతలు ఒక సోమరిపోతుని పొరపాటున ఇక్కడికి తీసుకువొచ్చారు. అతడే మన రాజ్యంలో అందరికీ ఈ పిచ్చిపనులు నేర్పి చెడగొడుతున్నాడు." అని.

"అతన్ని వెంటనే పిలిపించండి."

దేవదూతలు మధుగుప్తుని కుబేరుడి వద్దకు తీసుకొచ్చారు.

"నువ్వేనా నా ప్రజలికి పాటలు, బొమ్మలు నేర్పుతున్నది?" అని అడిగాడు కుబేరుడు.

"అవును. అందాన్ని ఎలా సృష్టించాలో నేర్పుతున్నాను." అన్నాడు మధుగుప్తుడు.

"దేనికీ ఆ అందం?"

"ఏమీలేదు, ఊరికేనే." కుబేరుడు ఆశ్చర్యపోయాడు. తన జన్మలో మొదటిసారిగా విన్నాడు 'ఊరికేనే' అనేమాట.

"నిన్ను పొరపాటున దేవదూతలిక్కడికి తీసుకొచ్చారు. ఈ లోకంలో ఊరికే ఏ పనీ చెయ్యకూడదు. ప్రతిపనికీ అర్థం, ఉపయోగం వుండాలి. దానివల్ల లాభం

(44 వ పేజీ చూడండి)




శ్రీ భావరాజు వీరేశలింగ ప్రసాదరావు

ఒకానొక దేశాన్ని ఓ రాజుగారు పాలిస్తూవుండేవారు. ఆయనకు రోజూ వూరేగడమంటే ఎంతో సరదా. అందుచేత ప్రతిదినం సాయంకాలం ముత్యాలపల్లకీ నెక్కి పట్టణమంతా వూరేగివచ్చేవాడు.

ఇలా రోజూ వూరేగుతుండడం ఒక మిడత చూచింది. రోజు ఎక్కడికి పోతాడో, ఎందుకు పోతాడో, కనుక్కోవాలని బుద్ధిపుట్టింది. ఒకనాడు రాజుగారి పల్లకీ ఆదోవను రానడం చూసి వెంటనే మీదకు ఎగిరింది. పల్లకీమీదకు ఎగిరింది పల్లకీమీదనే వుండక లోపలికి వచ్చి తచ్చాడడం మొదలెట్టింది. రాజుకు వెంటనే కోపం వచ్చి దాన్ని గబుక్కున పట్టేసుకుని గుప్పిటలో బంధించాడు. కాని అది ఏ పురుగో తెలియలేదు.

ఇంతట్లో ఆస్థానజ్యోతిష్కుడు మిడతంభొట్టుగారు ఎదురుగా వస్తూ కన్పడ్డాడు. ఇతడు నిజమైన జ్యోతిష్యం చెప్పగలడో, లేడో పరీక్షిద్దామని బుద్ధిపుట్టింది రాజుగారికి. అందుచేత గుప్పిలి చూపించి "ఏమోయ్ భొట్టూ! ఈవేళ నీ అసలు తెలివి ప్రయోగించాలి. రోజూలా పంచాంగాలూ, పాత కట్టలూ తిరగేసి చెప్పడం కాదు. ఇదిగో నా పిడికిలి. ఇందులో ఇప్పుడేముందో చెప్పుకోవాలి. అదీ నీ ప్రతిభ. చెప్పితే కోరిన వరం ఇస్తాను. లేకపోతే తెలుసా?" అన్నాడు.

మిడతంభొట్టుకు మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. ఏమీ తోచలేదు. ఇంతవరకు ఏవేవో అడ్డచక్రాలు, నిలువుచ కాలు వేసి జాతకాలఫలితం చెప్పేవాడు. అందులో కొన్ని నిజమయ్యేవి. కొన్ని అబద్ధమయ్యేవి.

ఇప్పుడు నించున్నపళంగా చెప్పమనేసరికి ఆయనకి కంగారుపుట్టి, ఏమీ తోచక, "ఓ పరమేశ్వరా! ఏం జేస్తున్నావు పైన?" అని ప్రార్థించసాగాడు.

రాజు మళ్ళీ అడిగాడు "ఏం అలా చూస్తున్నావు! ఇందులో ఏముందో తెలిసిందా?"

ఇంక వూరుకుంటే లాభం లేదు, అనుకొని మిడతంభొట్లు ఇలా అన్నాడు. "మహారాజా! యీవేళ

నీ చేతిలో చిక్కిపోయాడు సుమా మిడతంభొట్లు" అన్నాడు జాగ్రత్తగా.

వెంటనే రాజు పిడికిలి విప్పి చూశాడు. అందులో నిజంగా వున్నది మిడతే! అందులో సందేహం లేదు. అబ్బ! జ్యోతిష్కుడు ఎంత గొప్పవాడు. ఉన్న దున్నట్లు చెప్పేశాడు. "శెభాష్ భొట్లూ" అన్నాడు.

రాజుగారు వరం ఇస్తానన్నాడుగా అందుచేత "సరే! భొట్లూ రేపు ప్రొద్దున్నే కొలువులో హాజరవు. అపుడు నీ కోరిక తీరుస్తా" అని వెళ్ళిపోయాడు.

మిడతంభొట్లు ఆనందం పట్టలేక, వెళ్తున్న పని కాస్తా మఱచిపోయి ఇంటిదోవ పట్టాడు. "ఈవేళ రాజు కోరకుండానే అడిగిన వరం ఇచ్చేస్తానన్నాడు. ఇంత సంతోషమైన సంగతి వెంటనే ప్రియమైన భార్యతో చెప్పెయ్యద్దూ. నిజంగా గంగానమ్మ ఎంత సంతోషిస్తుందో! ఇంకతనిని "ఇంద్రుడు చంద్రుడు" అని పొగడేస్తుంది. ఈవేళనుంచి ఇంక తిట్టుండవు. ఎంతో గౌరవం జేస్తుంది. సరే. ఇంక రెండోది. రాజుగారిని ఏం కోరాలి? ఏం కోరుకుంటే బాగుంటుంది? తనకి అన్నిటికన్న యిష్టమైన వస్తువు యీ ప్రపంచంలో ఏముంది?" అని ఆలోచించాడు. అసలు మిడతంభొట్టుకు ఎన్నాళ్ళబట్టో వుంది. ఒక్కసారిగా గంపెడు గారెలు తిందామని. పాపం! ఇన్నాళ్ళవరకు, ఆ కోరిక తీరనే లేదు. ఒక్కొక్క గారె తింటుంటే నిజంగా



ఎంత కమ్మగా వుంటుందో! అసలు "గారె" అనే ఆ పేరే ఎంతో కమ్మగా వుంటుంది. రాజుగారిని తప్పకుండా రేపు అడిగెయ్యాలి గారెలు వండడానికి కావలసిన సామానులన్నీ; ఇలా ఆలోచిస్తూ ఇంటి కొచ్చాడు.

"ఏమేవ్! ఏమేవ్! తలుపు తియ్యవే! తలుపు తియ్యి!" అని బాదాడు. గంగానమ్మ పరుగెత్తుకుంటూ వచ్చి తలుపు తీసింది. "ఒసే ఒసే! ఈవేళ ఎంత అదృష్టమనుకున్నావ్! ఎంత అదృష్టం! బలే! బలే! అని లొట్టలు వేశాడు. "ఇంతకీ అసలుసంగతేమిటో చెప్పండి" అని ఆతృతతో అడిగింది. భొట్లు చెప్పిందే చెప్పుతూ గంటన్నరసేపు మహావీర కార్యంలా వర్ణించాడు. గంగానమ్మకుకూడా ఆనందంతో చింకిచేటంత మొగం అయింది.

రాత్రిభోజనాలయిన తరువాత, భర్తని ఏం కోరిక అడగమని చెప్దామా అని తీవ్రంగా ఆలోచించింది గంగానమ్మ. చివరికి ఒక పెద్ద జాపితా తయారు చేసింది. అప్పుడే గదిలో భొట్లు కలలు గంటున్నాడు తను ఊఁ, గారెలు తినేస్తున్నట్లు, ఇంతట్లో గంగానమ్మ వచ్చి "ఏమండోయ్ అప్పుడే నిద్రపోయారు! మాయ నిద్రా మీరూను. లేవండి" అని లేపింది.

ఇంక మొదలెట్టింది. "ఏమండోయ్! మనం అడగవలసినవి వరసాగ్గా చెబుతాను వినండి. ఒక చంద్రహారం, ఒక నానుపేట, ఒక కట్ట కాసులపేరు- ఇవన్నీ బంగారంవే సుమండీ, మరచిపోయేరు

గనక—ఒక వజ్రపు పొడి వుంగరం, అరడుగు వెడల్పు, అంగుళంమందం గల వడ్డాణం, ఒక డజను గాజులీచేతికీ, ఒక డజను ఆ చేతికీ, ముక్కుకి నత్తూ బేసరీ, చెవలకి కమ్మలూ చెవ్వాకులూ, కాళ్లకి పట్టీలు కడియాలూ, నెత్తిమీద నాగరం, క్రింద జడగంటలూ, ఇంతే సుమండీ. ఈసారికివి చాలు. ఇందులో ఏవొక్కటీ మరచిపోకూడదు. అన్నీ జ్ఞాపకం వున్నాయా? ఏదీ వొక్కసారి చెప్పండి... మళ్ళీ చెప్పండి" ఇలా భొట్టుచే పదిసార్లు అనిపించింది. అనకపోతే పీక నొక్కేస్తుందని భొట్టుకి తెలుసు. అయితే తన గారెల సంగతేమిటి? అడుగుదామనుకున్నాడు. కాని అడగలేదు. ఇంక తన కోరిక ఇంతేనా అని ఎంతో విచారించాడు.

తెల్లవారింది. భొట్టు లేచి శుభ్రంగా మొగంకడుక్కున్నాడు. ఒక మంగలివానిని పిలిపించి నున్నగా గుండు గీయించాడు. స్నానం చేసి అరవీసెడు విభూతి తీసి మొగానికీ, భుజాలకీ, చేతులకీ పట్టించాడు. ఒక తులం ముక్కుపొడుం చేతిలో వేసుకొని నర్దుతూ "హ్హాం హ్హాం" అంటూ పట్టించేశాడు రెండురంధ్రాలద్వారా. అది నసాళమంటటంతోనే బుర్ర చురుకుగా పనిచెయ్యడం మొదలెట్టింది.

తిన్నగా బయలుదేరి రాజసభకి వెళ్లాడు. "భొట్టుగారూ! మీ కోరికేదో అడగండి" అన్నాడు రాజుగారు.

ఈ లోపుగా ఒక గమ్మత్తు జరిగింది. భొట్టు ఇంటిదగ్గరనుంచి గంగానమ్మ చెప్పిన వరసప్రకారం వల్లించుకుంటూ వస్తున్నాడు. కాని దోవలో ఒకళ్లింట్లో గారెలు వండుకుంటున్నారు. "చుంయ్, చుంయ్" మని పైకికూడా వినిపిస్తోంది. భొట్టు ఆ యింటిముందునుంచి వెళ్తుండగా, అతని ముక్కురంధ్రాలు రెండూ అమాంతంగా గారెల వాసన పీల్చేసి "భొట్టూ భొట్టూ! గారెలు ఎంతకమ్మగావున్నాయో చూశావా?" అని హెచ్చరించాయి. పాపం! దానితో గంగానమ్మ చెప్పినవన్నీ మరచిపోయాడు.

రాజుగారు అడిగేసరికి తడుముకోకుండా అడిగాడు "మహారాజా, నాలుగు బస్తాల మినప్పప్పు, బాగా పొట్టు తీసింది; రెండు మణుగుల మంచినూనె, పైరునువ్వులది; బాగా ఎండిన చింతకర్ర, రెండు పుట్లు; పెద్ద బూర్లెమూకుడూ; తెల్లటి ఉప్పు పదివీశెలూ—ఇవన్నీ వెంటనే యిప్పించాలి మహారాజా, యిదే నా కోరిక" అన్నాడు గుటకలు మ్రింగుతూ. సభలోనున్నవాళ్ళంతా "ఫక్కు" మని నవ్వారు. రాజుగారికికూడా నవ్వొచ్చింది. ఆ సరుకులన్నీ యిప్పించమని ఒక సావుకారికి ఆజ్ఞయిచ్చాడు.

భొట్టు బండినిండా సామానులు వేయించుకొని తిన్నగా ఇంటివైపు బయలుదేరాడు.

ఇంటిదగ్గర గంగానమ్మ గుమ్మంలో నుంచొని ఎదురు చూస్తోంది, తన భర్త ఎప్పుడొస్తాడా? చంద్రహారం, కట్టకాసులపేరు, వెండికడియాలూ, ఇవన్నీ ఎప్పుడు పట్టుకొస్తాడా అని.

ఈలోపుగా బండినిండా గారెల సామానుతో తయారైన భర్తని చూసేసరికి గంగానమ్మకు వెఱ్ఱి కోపం వచ్చేసింది. కాళికాంబవారి అవతారం పూనింది. జుట్టు విరబోసుకొని, పళ్లు బిగించి మీదపడడానికి సిద్ధంగా వుంది. భట్టుకు ముందరే తెలుసును గంగానమ్మయీ స్వరూపం దాలుస్తుందని. అందుకనే గుండు తడుముకుంటూ, అడుగులో అడుగు వేసుకుంటూ గుమ్మందగ్గరికి వచ్చాడు. వెంటనే "చంద్రహారం తెచ్చావా? కట్టకాసులపేరేది? వడ్డాణం, కడియాలు ఏవి? అసలు రాజుగారి నడిగావా? ఈ బస్తాలేంటి? పుల్లలేంటి? మాట్లాడవేం? మాట్లాడు. చెప్పు. చెప్పు" అని విఱుచుకు మీదపడింది ఆవిడ.

భట్టుకు ఏమీ పాలుపోలేదు. నోట మాటరాక "మె మె మె మ్మే; మె మ్మే; మె మె మెమ్మే" అన్నాడు.

గంగానమ్మకు కోపం మరీ ఎక్కువయింది. "ఉండు నీబుఱ్ఱ రామకీర్తన పాడిస్తాను. వట్టి పాడుబుఱ్ఱ. అంతా మట్టే. పూర్తిగా మట్టి. ఛీ! చవటబుద్ధి" అని బండరాళ్ళలా దొర్లించేసింది తిట్లు.

భొట్టు మెల్లిగా ధైర్యంచేసికొని జరిగిన వృత్తాంతము నివేదించాడు. గంగానమ్మ నీ గారెలరోగం కుదురుస్తానుండు. అంత పప్పు నానపోసేసి, అన్ని పుల్లలు తగలపెట్టి, గార్లన్నీ వండేస్తాను. నేను ఒక్కముక్క ముట్టుకోను. అన్నీ, నీముం

దరే పెట్టాను. తినకపో చెప్తాను నీ పని. ” అంది.

గంగానమ్మ, చెప్పిన ప్రకారం గార్లన్నీ వండేసింది. భోట్టుని “ఇంట్లోంచి కదిలావంటే జాగ్రత్త” అని వంటింటి గుమ్మంలో విగ్రహంలా కూలేసింది.

ఒక్కొక్క పళ్ళెమే తీసుకొచ్చి మిడతంభొట్టుముందర వుంచింది. వేడివేడిగా వున్నాయేమో ముందర జోరుగనే వెళ్ళిపోయాయి గారెలు. కాని ఎన్నని తినగలడు! సాయంకాలం ఆరు అయింది. ఆవిడ వండడం మానలేదు. “ఇంకా ఎన్ని వండుతుందిరా భగవంతుడా! ఇప్పటికే తినలేక చస్తున్నాను.” అని భోట్టు ఇంటి కప్పువైపు చూస్తూ దిగాలుపడుతున్నాడు.

మళ్ళీ ఇంకో పళ్ళెంలో గారెలు పేరుస్తోంది గంగానమ్మ. “అమ్మ బాబోయ్” అని గబుక్కున లేచి ఆంజనేయమంత్రం పఠిస్తూ అదే పరుగు లంకించుకొన్నాడు. గంగానమ్మ వెనక్కి తిరిగిచూసింది. చూసిందికదా! భర్త లేడు! ఆరి! ఎప్పుడు దూకేశాడు బయటికి? నేనిక్కడే వున్నానే! వీడ్ని వదిలిపెట్టకూడదు. అని ఆ గారెల పళ్ళెం డిట్టుకొని గంగానమ్మ అతడ్ని వెంబడించింది.

భోట్టు, గంగానమ్మ రైలువేగంతో పరిగెత్తారు చాలదూరం. ఈలోగా బాగా చీకటిపడింది. అమావాస్యరాత్రి అవడంవల్ల కన్నుకి కన్ను కన్పించడంలేదు. భర్త ఎక్కడున్నాడో చీకట్లో కనుపించక, గంగానమ్మ “తెల్లారితే ఇంటికి రాకుండావుంటాడా? అప్పుడు చెబుతా నీయనపని.” అని అనుకుంటూ ఇంటికి పోయింది.

మిడతంభోట్టు భార్య వెళ్ళిపోయిన సంగతి తెలియక ఇంకా పరుగెట్టి ఒక పెద్ద మైదానంలోకి వచ్చాడు. ఇంక పరుగెత్తలేకపోతున్నాడు. ఇంతలో ఒక చిన్న గొయ్యి కనిపించింది. వెంటనే అందులోకి దూకాడు. గంగానమ్మ వస్తుందేమోనన్న భయంతో పైకి చూడకుండా కళ్ళుమూసికొని గోతి అడుగున ముడిచిపెట్టుకు కూర్చున్నాడు.

గారెలు తిన్న ఆయాసానికీ, పరుగెత్తిన పరుగికీ అలసట వచ్చి భోట్టు వొళ్ళు మరిచి అలా కూర్చొనే నిద్రపోయాడు.

సరిగ్గా ఆవేళరాత్రే రాజుగారింట్లో దొంగలు పడి డబ్బంతా దోచుకున్నారు. పట్టుబట్టలూ, వెండిపాత్రలూ, బంగారునగలూ అన్నీ పెట్టెలతోసహా ఎత్తుకొచ్చారు. వారుకూడా పారిపోయి వచ్చి ఆ మైదానంలోకే చేరుకున్నారు. ఇంక రాజభటుల భయం లేదనుకొని వారంతా పెట్టెలు క్రిందపడేసి విశ్రాంతి తీసుకోడానికి కూర్చున్నారు. ఈ అలసటకి వారిలో కొంతమందికి దాహం వేసింది. కాని వారిదగ్గర మంచినీళ్లు కొంచమైనా లేవు. సామానులన్నీ వెదికారు. నాలుగయిదు కొబ్బరికాయలుమాత్రం దొరికాయి. కాని కొబ్బరికాయలు కొట్టడానికి దగ్గరలో ఒక్క రాయి కూడ లేదు. చుట్టూ మైదానం! అయినా వెతుకుదామని నలుగురూ, నాలుగుమూలలకీ వెళ్లారు. ఇంతట్లో ఒకడికి మిడతంభొట్టున్న గొయ్యి కనపడింది. అందులో వాడి కొకనున్నటి రాయి కనపడింది. “ఏమ గ్రోమ్, ఇలా రండి. ఇక్కడో రాయుంది.” అని కేకేశాడు. అంతా అక్కడకు వచ్చారు. నిజానికి అది రాయి కాదు. మిడతంభొట్టుగుండు. ఆవేళ ప్రొద్దున్నే కదూ నున్నగా గీయించాడు! అంచేత నక్షత్రకాంతిలో మిలమిలా మెఱుస్తూంది నల్లరాయిలా.

ఒక దొంగ కొబ్బరికాయ తీసుకొని మిడతంభొట్టు గుండుమీద “ఠఫీ” మని కొట్టాడు. గాఢనిద్రలో నున్న భొట్టుకి తలమీద ఏదో చీమ కుట్టినట్లయింది. ఇంతలో రెండవసారి కాయ ఠఫీమని కొట్టాడు దొంగ. ఈసారి బాగా మెంకువ వచ్చింది. కాని భొట్టువుద్దేశ్యం, ఇంకా గంగానమ్మ గారెల పళ్ళెంతో వచ్చి తినమని మొట్టుతోందేమో ననే. అతనికి తెలుసును గంగానమ్మ మొట్టితే ఇలాగే వుంటుందని. ఇంతలో ఠఫీమని మళ్ళీ తగిలింది. ఇంక వూరుకోలేక “బాబోయ్! బాబోయ్! మొట్టకే! వస్తున్నానే! ఎన్ని తెచ్చావ్? పదా, పాతికా,

(44-వ పేజీ చూడండి)

# టామ్ సాయర్

(31-వ పేజీ తరవాయి)

"ఊఁ. గాలివచ్చి ?"

"దీపాన్ని ఆర్పేసిందిట."

"ఓరి దేవుడా. నిజమే. ఊఁ."

"ఆ తరవాత నువ్వు అదేమిటి ఆ తలుపు తీసి వుంది?' అన్నావుట."

"చెప్పు. తరవాత ?"

"ఆగు, జ్ఞాపకం చేసుకోని. సిడ్‌ని వెళ్లి తలుపువేసి రమ్మన్నావుట."

"అవును చెప్పాను. ఇదేమిటమ్మా ఆశ్చర్యంగా వుందే. నిజంగా జరిగినదంతా కలల్లోకి రావటం వింతగా వుంది తరవాత ?"

"ఆ. ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది అంతా." అని టామ్ ఆ రోజు రాత్రి తను దొంగచాటుగా వచ్చి చూసిన దంతా కలలో చూసి నట్టు కల్పించి చెప్పాడు. పెద్దమ్మ నిర్ఘాంతపోయి విన్నది. ఈసంగతి సాయంత్రంలోగా వెళ్ళి జోహార్పర్ తల్లితో చెప్పివెయ్యాలనుకున్నది. తలుపు లన్నీ వేసివున్న గదిలో రాత్రివేళ జరిగిన సంగతి అంతదూరాన వున్న టామ్‌కి కల రావటం ఆమెకి దేవుడి మాహాత్మ్యంగా తోచింది.

చివరికి టామ్ ఇంకో చిట్కా వేశాడు. పెద్దమ్మ నిద్రపోయిందట, అప్పుడు టామ్ వంగి ఆమె నుదుటి మీద ముద్దుపెట్టుకున్నాడుట.

ఇది వినగానే పెద్దమ్మ పొంగిపోయి 'తనంటే టామ్‌కి ఎంత ప్రేమో, కలలో కూడా ముద్దు పెట్టుకున్నాడు' అనుకుంది. టామ్‌కి ఒక పెద్ద ఆపిల్ పండు ఏరి ఇచ్చి, బళ్లోకి పంపించింది.

పెద్దమ్మ జోహార్పర్ ఇంటికి బయల్దేరింది టామ్ కలసంగతి చెప్పటానికి. కాని సిడ్‌కి నమ్మకం కలగలేదు, "ఈ కలంతా అబద్ధం. నిజంగా జరిగిన సంగతి కలలో కెళ్లా వస్తుంది. ఇందులో ఏదో కిటుకుం" దనుకున్నాడు.

ఉన్నట్టుండి ఎంత గొప్పవాడయిపోయాడు టామ్! స్కూల్లో మామూలుగా చేసే కోతి చేష్టలేమీ చెయ్యలేదు. ఠీవిగా నడిచాడు. అందరూ తనకేసే చూస్తున్నారని తెలుసు. కాని తెలియనట్టు నటించాడు. అందరూ తన్నిగురించే మాట్లాడు కుంటున్నట్లు తెలుసు. కాని విననట్టు నటించాడు. మరీ చిన్నపిల్లలు అతను వెడుతుంటే నోరు తెరుచుకుని నిలబడిచూశారు. అతని యీడువాళ్లు లోపల అతని కీర్తికి ఈర్ష్య పడుతున్నా ఆ సంగతేమీ తెలియనట్టు నటించారు.

అయినా చాలామంది టామ్, జోల చుట్టూ మూగారు. వాళ్లు వర్ణించే సాహసాలు వినడానికి. అందులో టామ్ కల్పనా శక్తి అద్భుతం. జరిగినవీ, జరగనివీ అన్నీ పెద్ద కథలాగా చెప్పాడు. కథ పూర్తయిం తరవాత జేబుల్లోంచి చుట్టలు తీసి వెలిగించి వాళ్లిద్దరూ వెళ్లిపోతుంటే మిగతా పిల్లలు వాళ్లు సామాన్య మానవులు కారనీ, దేవతలేననీ అనుకునేంతదాకా కథ నడిచింది.

టామ్ తనకి కీర్తి వచ్చేసింది కనక బెకీథాచర్‌ని గూర్చి ఆట్టే పట్టించుకోకూడ దనుకున్నాడు. బెకీ అప్పుడే వచ్చింది స్కూలుకి. ఆమెని చూడనట్టు నటించాడు టామ్. పక్కకి వెళ్ళిపోయి కొందరు మగపిల్లల్ని, ఆడపిల్లల్ని చుట్టూ చేర్చుకుని ఏదో మాట్లాడుతున్నాడు. ఆమె అటూ యిటూ తోటి పిల్లల్తో పరిగెడుతూ కేరింతలు కొడుతోంది. కాని ఆమె ఎంతసేపూ తన చుట్టుపక్కలే తిరుగుతూ వుండటం, అప్పుడప్పుడు తనకేసి దొంగచూపులు చూడటం గమనించాడు టామ్. దాంతో అతని బింకం మరీ ఎక్కువైపోయింది.

కొంతసేపటికి బెకీ పరిగెత్తటం మానేసి నిట్టూర్పులు విడుస్తూ టామ్ ఎదటినించే రెండుమూడు సార్లు తిరిగింది. టామ్ అందరికంటే ఎక్కువగా ఆమీలారెన్సుతో మాట్లాడటం కూడా చూసింది. ఆమెకి ఉక్రోషం వచ్చింది. అక్కణ్ణించి వెళ్ళిపోదా మనుకుంది గాని ఆమె కాళ్లు ఎంతసేపటికీ టామ్‌వైపే తిరుగుతున్నాయి.

టామ్ పక్కనే నుంచున్న ఒక పిల్ల దగ్గిరికి వెళ్ళి

"మేరీఆస్టిన్! నిన్న నువ్వు ఆదివారం బడికి రాలేదేం?" అనిఅడిగింది.

"వచ్చానే. నన్ను చూడలేదా?"

"ఊహూ. ఎక్కడ కూర్చున్నావు?"

"మిస్‌పీటర్సు క్లాసులో."

"నిజంగానా? నీతో పిక్నిక్ విషయం చెబుదామనుకున్నాను నిన్న. (పిక్నిక్ అంటే కొందరు స్నేహితులు కలిసి ఊరికి దూరంగా ఎక్కడో ఒక చోటికి సరదాగా యాత్రకి వెడతారు. కూడా తినుబండారాలు మొదలైనవి తీసుకువెళ్ళి కొంతసేపు గడిపి తిరిగివస్తారు)

"పిక్నిక్‌లో నన్నుకూడా చేర్చుకుంటావా?" అని అడిగింది మేరీ ఆస్టిన్.

"ఓ. నాకోసమే మా అమ్మ తలపెట్టింది పిక్నిక్. నా యిష్టమొచ్చిన వాళ్ళని తీసుకు వెళ్లచ్చునంది మా అమ్మ. నా స్నేహితుల్ని అందర్నీ తీసుకువెడతాను." అని బెకీ అంటూ టామ్‌కేసి దొంగ చూపు చూసింది. కాని టామ్ వినీ విననట్టుగా ఆమీలారెన్సుతోనే మాట్లాడుతున్నాడు. తాను సముద్రపు దొంగగా వున్నప్పుడు వచ్చిన తుపాను గురించి చెబుతున్నాడు. ఒక పెద్దపిడుగు పడిందనీ, అది తనకి మూడడుగుల దూరంలో వున్న చెట్టుమీద పడినా అదృష్టం వుండి తను బతికాననీ కోతలు కోస్తున్నాడు.

"నేనూ రానా పిక్నిక్‌కి?" అని అడిగింది గ్రేసీమిల్లర్.

"ఊ"

"నేను?" అంది శాలీరోజర్సు

"ఓ"

"నేనూ, జో కూడా రామా?" అంది సూసీహార్పర్.

"తప్పకుండా."

టామ్, ఆమీ తప్ప మిగతా వాళ్ళంతా అడిగారు. బెకీ అందర్నీ తీసుకుపోతానంది. తరవాత టామ్ మాట్లాడుతూనే ఆమీతో కలిసి వెళ్ళిపోయాడు. బెకీ ఉక్రోషం పట్టలేకపోయింది. ఎవ్వరికీ కనిపించని ఒక మూలకి పోయి బాగా ఏడ్చింది.

ఆ మధ్యాహ్నందాకా టామ్ ఆమీలారెన్సుతో కలిసే ఉన్నాడు. బెకీ కనిపించలేదు. ఎక్కడుందో చూద్దామని స్కూల్లో అన్ని గదులూ వెదికాడు. ఆమె నింకా ఏడిపించాలనే అతని ఉద్దేశ్యం. హఠాత్తుగా బెకీ కనిపించింది. కాని ఒక్కత్తే లేదు. ఆల్ఫ్రెడ్ టెంపుల్‌తో కలిసి బొమ్మలపుస్తకం చూస్తోంది. వాళ్లు టామ్‌ని చూడలేదు. నవ్వుతూ తుళ్లుతూ బొమ్మలు చూస్తున్నారు. ఈసారి టామ్‌కి ఉక్రోషం వచ్చింది.

కాని ఆమీ టామ్‌ని పట్టుకుని వదలటంలేదు. ఏదో సొద చెప్పుకుపోతోంది. ఆమె మాటలు అతని చెవికెక్కటం లేదు. అతని మనస్సు ఎక్కడో వుంది. ఆమీని వదిలించుకునేటప్పటికి టామ్ తల ప్రాణం తోకకి వచ్చింది. అప్పటికీ ఆమీ వెళ్ళిపోతూ స్కూలు వదిలిపెట్టాక ఇంటికి కలిసిపోదామని చెప్పిపోయింది. టామ్ ఇంకా రెండు మూడు సార్లు బెకీ, ఆల్ఫ్రెడ్ కూర్చున్న చోటున తిరిగాడు. కాని బెకీ చూడనట్టు నటించింది.

టామ్ తన్ని తనే తిట్టుకున్నాడు. బెకీ ఇందాక స్నేహం చూపించినప్పుడు మాట్లాడక పోవటం తనదే తప్పనుకున్నాడు. "టామ్ సట్టి వెధవ, బద్దు, బడుద్ధాయి దగుల్బాజీ" ఇంకా ఎన్నో తిట్లు తిట్టుకున్నాడు.

మధ్యాహ్నం స్కూలువిడిచిపెట్టాక టామ్ ఇంటికి విచారంగా వెళ్లాడు. టామ్ మళ్ళీ రాకపోయేటప్పటికి బెకీకి అనుమానం వేసింది, అతనికి కోపం వచ్చిందేమో నని. దాంతో దిగులుపుట్టింది. పుస్తకం టప్పున మూసేసి ఆల్ఫ్రెడ్‌తో మాట్లాడకుండా లేచి పోయింది.

ఆల్ఫ్రెడ్ వెంటపడ్డాడు. కాని ఆమె అతన్ని తోసేసింది. "ఫో, అవతలకి. నిన్ను చూస్తే నాకు అనహ్యం వేస్తోంది." అన్నది.

ఇంతవరకూ స్నేహంగా వుండి ఇప్పుడిల్లా అంటుందేమా అని ఆల్ఫ్రెడ్ విస్తుపోయాడు. కాని అతనికి అర్థమైంది. టామ్‌మీద కసి తీర్చుకోటానికే తనతో కాసేపు స్నేహంగా వున్నదని. బాగా ఉడుక్కున్నాడు. టామ్‌మీద ఎల్లాగైన కసి తీర్చుకోవా లనుకున్నాడు. టామ్ కూర్చునే బల్లమీద అతని పుస్తకాలు కనిపించాయి. అందులో కాంపోజిషన్ పుస్తకం తీసి దాంట్లో కొత్తగా టామ్ రాసిన పేజీమీద సిరా పోశాడు.

బెకీ ఇదంతా కిటికీ లోంచిచూసింది, కాని చూడనట్టుగా వెళ్లిపోయింది. టామ్‌మీద ఆమెకి కూడా కసిగానే వుంది. మేష్టారు టామ్ కాంపోజిషన్ పుస్తకంలో సిరా చూసిబాదుతాడు దాంతో టామ్‌రోగం బాగా కుదురుతుంది. తన కసి తీరుతుంది; అనుకుంటూ ఆమె ఇంటికి వెళ్లిపోయింది

# సోవియట్ పల్లెల్లో సినిమాలు

రచన **బోల్షకోవ్.**
సోవియట్ రష్యాలో సినిమా పరిశ్రమశాఖామంత్రి

అనువాదం
**శ్రీ రావెళ్ల హనుమంతరావు**

సోవియట్ ప్రజల ప్రవర్ధమానవైజ్ఞానిక తృష్ణను తృప్తిపరుస్తూ వినోద వికాసాల నిచ్చే సంస్థలు ఏడాది కేడాది వలలా దేశమంతటా అల్లుక పోయినాయి వీటికై ఉన్నత భవనాలు నిర్మింపబడ్డాయి ఇంకనూ నిర్మింప బడుతున్నాయ్

పట్టణ సినిమాథియేటర్ల నిర్మాణానికీ, జిల్లా కేంద్రాల్లోనూ, సమష్టివ్యవసాయ క్షేత్రాల్లోనూ వాటిసంఖ్య అధికం చేయ డానికి ప్రతిసంవత్సరం సోవియట్ ప్రభుత్వం తగినంత ధనాన్ని ఖర్చు పెడుతోంది సంచార సినిమాలసంఖ్యను అధికంచేయ డానికి సోవియట్ ప్రభుత్వం ఇతోధికమైన కృషిని గావించుతోంది.

పెట్టుబడిదారులూ- జమీందారీ భూస్వాములూ- ధనికవ్యాపారులు పెత్తనం చలా యించుతూన్న దేశాల్లో పట్టణాలకు, పల్లెలకు మధ్యగల వ్యత్యాసం ఒక అగాధసముద్రం అక్కడ పై స్సు- టెక్నికల్ - కళలు సాధించిన విజయాలు పెద్ద పట్టణాల్లో మాత్రమే కేంద్రీకరింప బడి యుంటాయి పల్లెటూళ్లు అజ్ఞానంలో- అంధకారంలోపడి మూల్గుతుంటాయ్

ఇక సోవియట్ రష్యా పరిస్థితి అలా కాదు అక్కడ 33 సంవత్సరాల క్రితం నూతనంగా అధికారంలోకి వచ్చిన సోవి యట్ ప్రభుత్వం పల్లెటూళ్ల జీవిత విధానాన్నే మార్చివేసింది సమష్టివ్యవసాయ పద్ధతి గ్రామీణ జీవితపు సరిహద్దుల్ని విశాలం చేసింది ప్రజసామాన్యంలో అణగి మణగివున్న సృజనాత్మక శక్తులను మేలు కొలిపింది సోవియట్ ప్రభుత్వం పల్లె గ్రామాల్లోని కార్మిక- కర్షక - కష్టజీవుల జ్ఞానోదయానికీ, సంస్కృతీ ప్రభావానికీ విశాలమైన రాచబాటను నిర్మించింది.

సమష్టి వ్యవసాయ క్షేత్రాల్లో స్కూళ్లూ- క్లబ్బులూ- రేడియోలూ- గ్రంథాలయాల సంఖ్య ఏడాది కేడాది పెరుగుతోంది జిల్లా - గ్రామీణ సినిమాథియేటర్లుగూడా క్రమంగా అధిక మౌతూన్నాయి రెండవ ప్రపంచయుద్ధప్రారంభంలో జిల్లా కేంద్రాల్లోనూ, పల్లెల్లోనూ కలిసి 20,200 సినిమా హాలులుండేవి వీటిల్లో చాలా భాగాన్ని నాజీ విధ్వంసకులు ధ్వంసం జేశారు అనేక థియేటర్లను కూలదోసి, కాల్చి వేశారు ఈ విధంగా దెబ్బతిన్నవాటిని, నాశనమై పోయినవాటిని తిరిగి మరమ్మతు చేయ డానికి ప్రభుత్వం ఎంతో ధనాన్ని ఖర్చు చేయావలసివచ్చింది ఈనాడు జిల్లాకేంద్రా ల్లోనూ, పల్లెటూళ్లల్లోనూ గల సినిమాహాలుల సంఖ్య యుద్ధానికి పూర్వం సంఖ్యకంటె హెచ్చయింది

సోవియట్ ప్రభుత్వ సినిమా పరిశ్రమ శాఖ గ్రామీణప్రజల సినిమా సౌకర్యాల అభివృద్ధికై సర్వవిధాలా ప్రయత్నించు తూంది దీని దృష్టి ముఖ్యంగా రైల్వేస్టేష న్లకూ, జిల్లాకేంద్రాలకూ దూరంగావున్న సమష్టి క్షేత్రాల వైపుకు ఎక్కువగా నిలుపు తుంది. గతసంవత్సరం యీ శాఖవారు సంచార సినిమాలకై సంచార విద్యుచ్ఛక్తి స్టేషన్లతోసహా 1400 మోటారు లారీలను సప్లయి జేశారు యీ సంవత్సరం ఇలాంటి లారీలు మరో రెండు వేలు లభ్యమౌతాయి

గత ఏడాది సోవియట్ ప్రభుత్వం దేశంలో ఉత్తమ సినిమాలు, సినిమా యంత్రాలు, థియేటర్లు, పనివాళ్లు ఎవరో తెలుసుకొని వారికి సహాయంచేయడానికి సినిమారంగాన్ని పరీక్షచేసింది ఈ సమీక్షవలన దేశంలోనున్న ఉత్తమ సినిమా యంత్ర నిపుణులు బయటపడ్డారు వీరిలో కొంతమందికి డబ్బుపూర్వక బహుమతులూ, మరికొందరికి యోగ్యతా పత్రములూ లభించాయి వీరి అనుభవంనుండి పల్లెల్లోనున్న సినిమా మెకానిక్కులు చాలా నేర్చు కొంటున్నారు.

దేశంలో సంచారసినిమాలను పరీక్షచేయడానికీ, మరమ్మతు చేయడానికీ 800 లకు పైగా సంచార సినిమా మరమ్మతు కేంద్రాలున్నాయి ఎక్కడైనా సినిమా యంత్రం పాడైతే దగ్గరనున్న కేంద్రానికి తక్షణమే తీసుకెళ్లి మరమ్మతు చేయించు కోవడం జరుగుతుంది

దేశంలో మారుమూల ప్రాంతాలలో నున్న ప్రజలూ, సమష్టి వ్యవసాయ దారులూ, సామాన్య ప్రజలంతా ఉత్తమ చిత్రాలు త్వరగా చూడటానికై ఫిల్ము ప్రతులసంఖ్యను ప్రభుత్వ సినిమాశాఖవారు అధికం జేస్తున్నారు ప్రతి సోవియట్ ఉత్తమచిత్రం 1500 నుండి 2000 కాపీలు ప్రింటవుతూన్నాయి వేయి కిలోమీటర్ల దూరంలోనున్న ప్రతిజిల్లా, కేంద్రీయ ప్రాంతాలకు ఫిల్ములు ప్రభుత్వ విమానాల మీదనే వెళ్లుతాయి ఇక్కడ డిస్ట్రి బ్యూటింగ్ కేంద్రాలకు అప్పగించుతాయి.

(45 వ పేజీ చూడుడు)



'పేదలపాట్లు' చిత్రంలో బజారుపిల్లగా చాకచక్యంతో నటించిన లలిత.

# మన్యంలో సాహసాలు

(9-వ పేజీ తరువాయి)

ఏందుకండీ విప్పారు పంతులుగారూ !" అన్నాడు.

"ఇది మిమ్మల్ని కాపాడుతుంది. దీని మహాత్యం అది" అన్నాడు సింహాద్రిరావు.

"ఎలాగండి?" అని రెండో మేష్టరు ప్రశ్నించాడు.

"ఏదేనా పెద్దపులికనక దీనిని చూసిందంటే, ఇది తనని మింగెయ్యడానికి వచ్చిన మృగసార్వభౌము డని తలచి తోక ముడిచేస్తుంది" అన్నాడు అతను.

"ఇది గొప్ప ఆలోచనే!" అని కళ్లెగరేశాడు మెచ్చుకొన్నట్లుగా, మరో ఉపాధ్యాయుడు.

అందరూ నవ్వేశారు.

"నాకు పెద్దపులులంటే భయమనుకొన్నారా? అబ్బే! ససేమిరా! ఎందుకంటారా? వినండి చెప్తాను. నేను చిన్నప్పుడు దసరాపండుగలలో పెద్దపులివేషం వేసేవాణ్ణి, సరదాకి" అని సింహాద్రిరావు చేతిలో గొడుగు కింద పారవేసి, మేష్టర్లని నమ్మించడానికని "జజ్జనక జనక-జజ్జనక జనక-జజ్జనక జనక" అని పులిఅడుగులు వేశాడు "పెద్దపులి కనక నిజంగా ఎదురయిందంటే, నేను దానిలాగు అడుగులు వేసి, బుజా[illegible]ంచి, నేలమీద వాలి పంజా చూపించే[illegible] 'ఇంకేం! మనవాడే!' అని దాని[illegible]నది చక్కా పోతుంది" అన్నాడు

ఈ ఫార్సు చూసి ఉపాధ్యాయులు పొట్టలు చెక్కలయేటట్లు నవ్వుతున్నారు.

మూడో ఉపాధ్యాయుడు "ఎంత ధైర్యం! ఎంత సాహసం! ఏమి కథ!" అన్నాడు.

సింహాద్రిరావు తన సాహసకృత్యాలు ఒకటి రెండు వర్ణించి చెప్పి, మేష్టర్లకి కలిగిన దురభిప్రాయాన్ని పూర్తిగా పారద్రోలదలచుకున్నాడు. "ఒకమారు ఊరికి వెళుతున్నాను" అన్నాడు అతను.

ఉపాధ్యాయులు శ్రద్ధగా వింటున్నారు.

"వెళుతూంటే దారిలో నక్కపోతు ఎగురయింది. మన కెందుకు పోనీ అని ఎంతసేపు నిలుచున్నా పోదు. చూశాను, చూశాను. చివరికి దానితో చెడుగుడు ఆడేశాను. అదీ నాతో సమానంగా గంతులు వేసింది. ఇహ దీనిని చంపేద్దామని అనుకొంటూండగా మా ఊరివాళ్లు దారిలో కలుసుకొన్నారు. నా ధైర్యం చూసి వాళ్లు 'అపరభీముడు' అని పేరు పెట్టారు" అని ధైర్యశాలిలాగ కనపడ్డాడు సింహాద్రిరావు.

మేష్టర్లు నవ్వుకొన్నారు. అందులో ఒకడు "నక్కపోతు కేమిటి లెండి!" అన్నాడు.

"అయితే మరొకటి చెప్తాను వినండి!" అన్నాడు సింహాద్రిరావు. "మా ఊరికి దూరంగా ఒక అడివి ఉంది. అప్పుడు నాదగ్గిర ఒక తుపాకి ఉండేది. అది బుజాన్ని వేసుకొన్నాను. టక్ టక్ టక్ మని దొరలాగు అడవిలో నడచిపోతూంటే, ఏనుగుకంటె పెద్ద జంతువొకటి ఎదురయింది. దానికి ఎనిమిది కాళ్లున్నాయి. రాతుసి తలకాయి. బారెడేసి కొమ్ములున్నాయి. పైగా తోండ ముంది. కాళ్లని చూస్తే మూరెడేసి గోళ్లున్నాయి. శరభమృగ మంటారు శాస్త్రాలలో. దానిని టప్ మని తుపాకి పేల్చి ఒక్క దెబ్బతో కాల్చేసి, అక్కడే పారేసి నాదారిని నేను చక్కా వచ్చాను" అని వీరుడులాగ కనబడ్డాడు.

"ఇది లేతసొరకాయ కోత. కాకపోతే ఎనిమిది కాళ్లేమిటి!" అన్నాడు రెండో మేష్టరు.

సింహాద్రిరావు చిన్నబుచ్చుకున్నాడు. "మీ రెప్పుడేనా చెన్నపట్టణం వెళ్లేరా?" అని ప్రశ్నించాడు.

"లేదు. మాకు చెన్నపట్నాలు ఎక్కడనుంచి వస్తాయండి!" అన్నాడు నాలుగో మేష్టరు.

"అయితే చెప్తాను వినండి! చెన్నపట్టణంలో ఒకచోట ఆకాశమంత ఎత్తు జంతువు లున్నాయి. అవి పెద్దపెద్ద చెట్ల చివరిఆకులు అంటే కొసలుగాని తినవు. వాటి వ్రత మది. మీరు విన్నారా మరి?" అన్నాడు సింహాద్రిరావు.

"ఏమిటో ఈ చిత్రం" అన్నాడు మూడో ఉపాధ్యాయుడు.

"ఫర్లాంగు పొడుగు జంతువులుకూడ ఉంటాయని పెద్ద పెద్ద పుస్తకాలలో రాస్తారు" అన్నాడు సింహాద్రిరావు.

ఉపాధ్యాయులు చిత్రంగా చూశారు.

తెలియని ఉపాధ్యాయులు తనమాటలు నమ్ముతున్నారని అతను సంతోషించాడు.

వాళ్లు దారిలో వాగులలో దిగుతున్నారు, ఎక్కుతున్నారు. ఇసకలో కాళ్లీడ్చుకొంటూ నడుస్తున్నారు. బండరాళ్లమీద జాగ్రత్తగా వెళుతున్నారు. ముళ్ళ కంపలు తొలగించుకొంటున్నారు.

పక్కనున్న డొంకలోంచి పామొకటి పారిపోతూంటే చూసి చెప్పాడు నాలుగో ఉపాధ్యాయుడు. సింహాద్రిరావు కంగారుపడ్డాడు. ఉపాధ్యాయులు నలుగురిని నాలుగు దిక్కులా ఉండమని తాను మధ్యని నడుస్తానన్నాడు. పాపం! వాళ్లు అలాగే చేస్తున్నారు. అప్పుడు వాళ్లకి ఈమోస్తరుగా హితబోధ చేశాడు. "అతిథిని రక్షించడం మీ విధి. ఒకవేళ ఏదేనా క్రూర జంతువు వస్తే మీరు దానిమీద పడిపోవాలి. అంతేగాని వెనక్కి తగ్గకూడదు. అసలు పరిగెత్తి పారిపోకూడదు. పైగా నా తలిదండ్రులకి ఒక్కణ్ణే! నాఒక్కడికీ ఏదేనా వచ్చిందంటే వాళ్లు ఎంత విచారిస్తారో మీరు ఆలోచించుకోండి. నన్నే నమ్ముకొన్న నా భార్యకి వైధవ్యం వచ్చిందంటే మీరు ఎంత పాపం వడిగట్టుకొంటారో ఊహించుకోండి. నా పిల్లల్ని దిక్కులేని వాళ్లనిగా చేస్తే మీకు పుట్టగతులుంటాయా!" అన్నాడు.

ఉపాధ్యాయులు అతని పిరికితనాన్ని చూసి ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు.

అతనికి వెనకవైపున ఉండవలసిన ఉపాధ్యాయుడొకడు అతనితో సమానముగా నడుస్తున్నాడు. ఆపళంగా సింహాద్రిరావు ముందడుగు వెయ్యడం మానివేశాడు. "నువ్వు నన్ను ఏ పెద్దపులికో అప్పజెప్పాలని చూస్తున్నావు. నువ్వు నీ స్థలం తప్పితే నేను ఒక్క అడుగేనా పెట్టను. చూశావో లేదో" అన్నాడు. ఆ ఉపాధ్యాయుడు తన స్థలంలోనే నడుస్తానని హామీ ఇచ్చాడు. "మీరందరు నేను చెప్పినట్లుగాకనక నడచుకోకపోతే మిమ్మల్ని అందరినీ మీ ఇనస్పెక్టరుతో చెప్పి డిస్‌మిస్ చేయించేస్తాను. కబడ్దార్!" అని బెదరించాడు. ఈ వెర్రివాడు తమమీద ఏమి నేరాలు చెప్తాడో అని వాళ్లు జడిశారు

మూడువంతుల దారి ముగిసింది. రెండో ఉపాధ్యాయుడు నేలమీద అడుగుల జాడ జూసి అనుమానపడి "ఈ దారినే అప్పుడప్పుడు పెద్దపులి వెళుతూంటుందని చెప్పుకొంటారండి" అన్నాడు.

"హా! చచ్చాను! నా గతేమి! మీరు ఇక్కడివాళ్లేకాబట్టి మీ కిటువంటి కర్మలు తప్పవుగాని నా కేమి గతి దేవుడా! ఈరోజు ఎలాగు సాయంత్ర మవుతుంది! నేను మళ్ళీ ప్రజలలో ఎలాగు పడతాను! ఏమిటి దారి భగవంతుడా!" అన్నాడు సింహాద్రిరావు.

అతని భయం చూసి ఉపాధ్యాయులు "మీ ప్రాణానికి మేం పూచీ ఇస్తాం" అన్నారు. సింహాద్రిరావు ధైర్యంగా ముందడుగులు వేశాడు.

కొమ్మలు బాగా పెరిగిన దుప్పి ఒకటి దారిలో ఎదురయింది.

"అదిగో!" అన్నాడు ఉపాధ్యాయుడు.

సింహాద్రిరావు దానిని చూసి, గొడుగు అక్కడ పారవేసి "అరే పెద్దపులి! అరే పెద్దపులి! మీద పడింది! మీద పడింది!" అని కేకలు వేస్తూ, వెనక్కి పరుగు పుచ్చుకొన్నాడు.

"దుప్పయ్యా! దుప్పయ్యా! దుప్పయ్యా!" అంటూ మేష్టర్లు అతని వెంటపడ్డారు. వాళ్లలో ఒకడు గొడుగు ఎత్తుకొన్నాడు. చిట్టచివరికి అతన్ని పట్టుకొన్నారు.

"నేను నమ్మను" అంటాడు సింహాద్రిరావు.

"మేం చూశాం. మాకు తెలుసు" అన్నారు ఉపాధ్యాయులు.

"అబ్బెబ్బే! మిమ్మల్ని ఎవరు నమ్మమని చెప్పాడయ్యా! నిష్కారణంగా ఈ ఒక్క బ్రాహ్మణ్ణి మీరు పెద్దపులినోట్లో పడెయ్యదలచుకున్నారు. నా కేమి సాధనం!" అని కళ్లు చేతులతో గట్టిగా మూసుకొన్నాడు. కాళ్లు నిలబడకపోగా కూలపడ్డాడు.

ఉపాధ్యాయులు బతిమాలుకొన్నారుగాని లేవడు. చేతుల మూత తీయడు.

"నన్ను మీ ఇనస్పెక్టరుగారికి అప్పజెప్పడం పూచీ మీది. అతన్ని నమ్మించి, పైగా నన్ను నమ్మించీ, మీరు ఈదారిని తీసుకొనివస్తున్నారు. నేనయితే ఈ పెద్దపులి వచ్చేదారిని వస్తానా! ఎన్నటికీ రాను! కావలిస్తే అడివికి అడ్డపడి వెళతాను కాని!" అన్నాడు సింహాద్రిరావు, రెండు చేతులతో కళ్లు మూసుకొని ఉండే!

"జంతువులు రాత్రి తిరుగుతాయికాని పగలు తిరగవు బాబూ!" అన్నాడు రెండో మేష్టరు

"నేనిక ఈ ప్రపంచాన్ని చూడను" అని "ఓ అమ్మా! ఓ నాయనా! మీరు నాకు దూరమయిపోయారా! మిమ్మల్ని ఎప్పుడు చూస్తాను!" అంటూ కళ్లొత్తుకొన్నాడు.

పంతుళ్ల మనస్సులు కరిగిపోయాయి.

"ఊరుదగ్గరికి వచ్చేశామండి పంతులుగారూ!" అన్నాడు నాలుగో మాష్టరు.

అతను వినిపించుకోలేదు. చివరికి వాళ్లు అతనిని లేవదీసి బుజాలమీద కూర్చోబెట్టుకొని మోసుకుపోదాం అని ఆలోచించుకొంటుండగా, మొదటి మేష్టరు "మీరేనా తుపాకితో శరభమ్మగార్ని కాల్చేసిన పెద్ద మనుష్యులు!" అన్నాడు.

"కాకేం!" అని కళ్లు విప్పాడు సింహాద్రిరావు

"ఎప్పుడండి?" అన్నాడు రెండో మేష్టరు.

"అదంతా చిన్నప్పుడు. ఇప్పుడైనా సరే చేతిలో తుపాకి ఉందంటే ఈ అడివికి నేనే రాజుని. ఈ వెధవఅడివికి జడుస్తానా! ఇదొక అడివా! ఇంకా మళ్లీ తిరుగుందా!" అన్నాడు సింహాద్రిరావు.

రెండో మేష్టరు తన చేతిలో ఉన్న కర్ర అతనికి అందించాడు. "ఇదే తుపాకి అనుకోండి. ఇప్పుడు నడవండి, చూద్దాం" అన్నాడు.

ఆ కర్ర తీసుకొన్నాడు సింహాద్రిరావు. "తుపాకి బుజంమీద వేసుకొని ఎలాగు నడుస్తారో చూపించమన్నావా?" అంటూ, కర్ర నానుకొని లేచాడు. ఆ కర్ర బుజంమీద వేసుకొన్నాడు. గంభీరంగా సిపాయిలాగ గబగబ నడక సాగించాడు. ఇదే బాగుందని అతనివెంట ఉపాధ్యాయులు కూడ పరుగెత్తారు. మనస్సులలో నవ్వుకొన్నారు.

ఇంతటిలో ఊరుదర్శనమయింది. బతుకు జీవుడా అని సంతోషించారు ఉపాధ్యాయులు. అడివిలోంచి బతికి బైటపడ్డానని సింహాద్రిరావు పొంగిపోయాడు. అందరూ కొండపల్లి చేరుకొన్నారు.





## మిడతం భొట్లు

(37 వ పేజీ తరువాయి)

తొంభైయూ? అన్నీ మింగేస్తానే! ఒక్కటీ వొదిలిపెట్టనే! ఒక్క గుక్కలో మింగేస్తానే! వస్తున్నా. ఉండవే, పట్టుకో." అని కేక లెయ్యడం మొదలెట్టాడు.

దొంగలు హడలిపోయారు. "ఇంత అర్ధరాత్రివేళ వూరిబయట గొయ్యిలో దెయ్యంకాక ఇంకేముంటుంది. ఇది తప్పక దెయ్యమే! ఇంకో దెయ్యం పైనుంది కాబోలు! లోపలి దెయ్యం పదిమందినైనా మింగేస్తుందట, పాతికైనా మింగేస్తుందట; ఇక్కడుంటే ప్రాణాలు దక్కవు" అని ఆ దొంగలు ఎక్కడి వక్కడే పారేసి మళ్ళీ చూడకుండా పారిపోయారు ఎవరిదోవని వాళ్లు.

భొట్లు పైకి వచ్చాడు. దూరాన దొంగలు పారిపోతున్నారు. ఒక్కొక్క పెట్టే తెరిచాడు. రత్నాలూ, ముత్యాలూ ఓ ఒకటేమిటి! అన్నిరకాలూ వున్నాయి. ఓ! ఇంకనే! అన్నీ పట్టుకుపోదా మనుకున్నాడు కాని తెల్లారిపోతోంది. ఈ నగలు పట్టుకు వూళ్ళోకెళ్ళితే రాజభటులు తప్పకుండ పట్టేస్తారు. పైగా వీడేదొంగని శిక్ష వేయిస్తారు. పీక అడ్డంగా కోసేస్తారు, అని ఆ పెట్టెలన్నీ ఆ గోతిలో పడేసి పూర్తిగా మన్ను కప్పి ఏమీ కనపడకుండా చేశాడు.

తెల్లవారుతుండగా భొట్లు వూళ్ళోకి వచ్చాడు. వచ్చీరాగానే ఇద్దరు రాజభటులు అతన్ని పట్టుకున్నారు. "మిమ్మల్ని రాజుగారు ఉన్నవారిని ఉన్నట్టుగ తీసుకొచ్చెయ్యమన్నారు. తక్షణం రాజసభకి పదండి" అని చెరో రెక్క పట్టుకుని రాజుగారి యెదటకు తీసుకొచ్చారు.

రాజు "భొట్లూ! ఏమీ అనుకోకు! చాలా ప్రమాదం జరిగింది నిన్న రాత్రి. అంచేత కబురంపించాను తక్షణం రమ్మని. దొంగలు ధనాగారమంతా దోచుకున్నారు. వారిని కనుక్కోనే భారం నీమీదే వుంది. నీ జ్యోతిష ప్రభావంపై నాకు గట్టి నమ్మకం" అన్నాడు.

"సరే! కాగితం కలం తెప్పించండి" అన్నాడు భొట్లు. నాల్గు నిలువు చక్రాలూ రెండు అడ్డ చక్రాలూ వేశాడు. అరగంటయిన తరువాత "రాత్రి కదూ జరుగుత?" అన్నాడు. అవునన్నాడు రాజు. "12గంటలకా?" సరిగ్గా అంతే నన్నాడు ఆత్రంతో రాజు. కాస్సేపు మళ్ళీ గీతలు గీసి ధన మున్నచోటు సరిగ్గా గుర్తులతో సహా చెప్పేశాడు.

ఆ గుర్తుల ననుసరించి పోగానే, పోయిన ధనమంతా దొరికింది. ఒక్క పైసాకూడ పోలేదు. రాజుకి పట్టలేనంత సంతోషం వచ్చింది. "నీకేం కావాలో కోరుకోవోయ్" అన్నాడు.

ఈసారి భొట్లు మినప్పప్పు, పుల్లలూ అడగలేదు. భార్య చెప్పిన జాపితా జ్ఞాపకం తెచ్చుకుని వరసాగ్గా అడిగేశాడు. రాజుగారు ఆ వస్తువులన్నీ ఇచ్చేశాడు.

ఇవన్నీ తీసుకొని యింటికి వచ్చి తలుపు తట్టాడు భొట్లు. భొట్లుకంఠం విని లోపలినుంచే రోకలొకటి తీసికొని గంగానమ్మ "ఆ వచ్చావా? రాకేం జేస్తావు? రాత్రల్లా ఎక్కడికి పోయావ్? ఇప్పుడైనా తిండుగాని రా" అంటూ తలుపు తీసింది. తీసేసరికల్ల, చంద్రహారాలూ, కట్టకాసులపేరూ, వడ్డాణం, కడియాలూ, గాజులూ అన్నీ పుచ్చుకొని నిలబడ్డాడు తన ప్రియమైన భర్త. వెంటనే రోకలి తలుపుమూలకు నెట్టేసింది. ఎంతో ఆశ్చర్యంతో "రండి! లోపలికి" అంది. వస్తువులన్నీ పుచ్చుకుని ఎంతో సంబరపడి "మీరేం! ఎంత మంచివారో! నిజంగా చాలా మంచివారండి" అని పొగడింది. "నువ్వూ అంతేనే;" అన్నాడు భొట్లు నవ్వుతూ.

---

## ఉరికేనే

(33-వ పేజీ తరువాయి)

రావాలి. కనక నిన్ను మళ్ళీ భూలోకానికే పంపించేస్తాను." అన్నాడు కుబేరుడు.

"ఓ. సంతోషంగా వెడతాను. ఈలోకంలో నాకు ఊపిరికూడా ఆడటంలేదు. మా భూలోకంలోనే బావుంటుంది. ఇక్కడికంటే." అన్నాడు మధుగుప్తుడు.

ఆ పక్కనే వున్న మధురలాలస "నేనుకూడా అతనితో వెడుతున్నాను." అంది.

కుబేరుడు తెల్లబోయి "నువ్వు కూడా ఎందుకూ?" అన్నాడు.

ఆమె అతనితో కలిసి యక్షలోకపు మెట్లు దిగుతూ,

"ఊరికేనే" అని నవ్వింది.

(మోహన్)

---

## సినిమా

(40 వ పేజీ తరువాయి)

ఇక్కడనుండి సినిమా మెకానిక్కులు మోటారుకార్లమీద - ఓడలమీద - గుర్రాలమీద - సినిమా ప్రేక్షకులకై అమూల్యములగు బహుమతులను పెట్టెల్లో వుంచుకొని తీసుకెళ్లుతారు. సోవియట్ కళాప్రభాసిత డాక్యుమెంటరీ చిత్రాలు, సులభగ్రాహ్యమైన సైంటిఫిక్ చిత్రాలు ఇవే వారు ప్రజలకిచ్చే బహుమతులు. 1950 సంవత్సరాంతానికి జిల్లా - గ్రామీణ కేంద్రాలలో 32,600 సినిమాలు పనిచేస్తాయి. యుద్ధానికి పూర్వంతో పోల్చిజూస్తే ఇది 100 కి 50 పాళ్లు అభివృద్ధి అన్నమాట.

సోవియట్ యూనియన్‌లో గ్రామీణ క్లబ్బులు, పఠనకుటీరాలు అత్యధికంగా వున్నాయి. గత యుద్ధసమయంలో ఇటువంటి విజ్ఞానకేంద్రాలు పెద్ద దెబ్బతిన్నాయి. వేలసంఖ్యలో నాశనమైపోయాయి. యుద్ధ మంతమవటంతోనే సోవియట్ ప్రభుత్వమూ, ప్రజలూ యీ సంస్థలను తిరిగి పునర్నిర్మించ బూనుకున్నారు.

ఈనాడు సోవియట్ రష్యాదేశంలో 13000 లకు పైగా గ్రామీణక్లబ్బులూ, 16000 వరకూ సమష్టి వ్యవసాయ క్షేత్రాలకు చెందిన విజ్ఞానమందిరాలూ, 2452 జిల్లా విజ్ఞానకేంద్రాలూ, 28000 లకు పైగా సామాన్య పఠనకుటీరాలు నెలకొని వున్నాయి.

రష్యాలో పల్లెగ్రామాలు - పట్టణాలు ఏడాది కేడాదికి అతి సుందరంగా తయారవుతున్నాయి. గత కొన్ని సంవత్సరాల్లో నిర్మింపబడ్డ సుందరమైన నివాసగృహాల మధ్య - విజ్ఞానమందిరాలకు, థియేటర్ భవనాలకు, క్లబ్బులకు ముఖ్యస్థానం వుంది. కారణం అవి మనోహరమైనవి; మహోన్నతమైనవి.

ప్రజాభివృద్ధికై సర్వవిధాలా కృషి జేస్తూన్న సోవియట్ ప్రభుత్వం సినిమా - నాటక - కళలద్వారా సంస్కృతీవికాసానికికూడా తీవ్రంగా పనిశేస్తోంది. ప్రభుత్వ బడ్జెట్టునుండి చాలా ధనం కేటాయించబడుతోంది. సినిమా - నాటక కళాభివృద్ధికి, వైజ్ఞానాభివృద్ధికిగాను సోవియట్ ప్రభుత్వం బడ్జెట్టునుండి 1950 సంవత్సరానికి కేటాయింపబడిన మొత్తం 1,20,700 మిలియన్ రూబుల్సు.

ప్రపంచంలో అత్యున్నతమైనట్టీ, అతి ఆధునికమైనట్టీ, ప్రజాస్వామిక సంస్కృతీ వికాసానికై సోవియట్ ప్రభుత్వం అన్ని సౌకర్యాలూ కలుగజేస్తోంది; ఇంకనూ కలుగజేయనుంది.

---

## నామకరణ మహాత్మ్యం

(26-వ పేజీ తరువాయి)

"శాయీనాన్,"

"ఆ శాయే వద్దన్నా, తలకాయ వాచి పోతోంది."

"అయినా యీ పేరు అతికించినట్టుంది గాని యేదైనా సమస్యయంగా వుందీ!"

"అవును యిన్ని పేర్లు రావాలంటే, ఒకదానిప్రక్కన ఒకటి వ్రాయటమే. అదిగో, సణుగుతోంది. పేర్లో నరసింహస్వామి రాలేదనేగా? లక్ష్మిలోనే వుంది ఆ అర్థం."

"నక్షత్రప్రకారం 'భ' రాలేదండీ."

"ఇంకా 'భ' కూడా యెక్కడ పెట్టమంటావు" ఇప్పటికే సతమత మయ్యాను అందర్నీ తృప్తిపరచలేక. శాస్త్రి 'భ' పెట్టు, విసుగు పుట్టేదాకా!"

"అంతకోప మవుతే..."

"నువ్వు చెప్పాల్సింది చెప్పావుగాకుట య్యా, ఇంకా యెన్ని సార్లు చెపుతావు?"

"వశిష్టులుగారూ, మీరు వూరుకోండి... అన్నయ్యా, ఏదో అయిపోయిందగా?"

"సరే యిక మడిగట్టుకోండి అయిందన్నమాటేగా?"

"ఏమిటి మడిగట్టుకోటం? నీకు అంత ఆకలిగా వుంటే నువ్వెళ్లి తిను. ఇప్పుడు యీపేరు ఖాయం చేశారనా?"

"సరే నేను పెట్టిన పేరు నీ కిష్టంలేకపోతే నీ యిష్టంవచ్చింది పెట్టుకో. నేను స్నానమన్నా చేస్తా."

"అదేమిటి, అన్నయ్యా, పెద్దవారు మీ రిక్కడ వుండి, పేరు పెట్టించి, ఆశీర్వచనము చేయ్యాలి. మీరు వెళ్లిపోతే యెలాగు?"

"యీశారా యెందాకా వచ్చిందో మన వాళ్ల తతంగంఎంత Backward state లో వున్నారో ఆలోచించండి. Foreign countriesలో యీ Christening functionకు యింత గందరగోళం వుండదు. ఏదో Something అనుకుంటారు. అయిపోతుంది."

"ఆ లండనుదొరతో నీ కు కూడ యేమిటి?"

"జైప్రకాశ్ పెట్టు చాల బాగుంటుంది"

"మావాడికి వుగ్గుపాలనుంచి అక్కర్లేదులే సోషలిజం."

"ఏమిటా మాటలు. పేరు చాలా బాగందని నేను అంటే, అనవసరంగా రాజకీయాల మాట యెత్తుతావే. అందుకనే విసుగు పుట్టుతుంది నిన్ను చూస్తే"

"వశిష్టులుగారూ, మీరు చెప్పండి యేదైనా పేరు?"

"నాకెందుకు? 'భ' రావాలంటేనే, నామీదకు తాడెత్తు లేచారు. మీ రేది వ్రాయమంటే అదే వ్రాయిస్తాను"

"అసలు యీగాంటి తికమకలున్నాయని తెలుస్తే మరందరే యేదోవకటి అనుకొని రావాలి గాని, తీరా పెట్లమీద కూర్చున్న తర్వాత యీ తర్జనభర్జన లేమిటి? ఎంతసేపు యిలా కూర్చోవటం? నాకు విసుగుపుట్టుతోంది. నేను వెళ్లుతున్నా."

"అందరు వెళ్లితే నేను లేస్తా."

"తప్పు, తప్పు, నువ్వు లేవకూడదు. అట్లా అయితే యేదోవకటి నువ్వే చెప్పేశెయ్యి."

"వెంకటరామమోహన్."



# నేపాల్ బాబా

(8-వ పేజీ తరువాయి)

మార్గం. జీవితంలో వుంటూ దానికి అతీతుడవైతేనే నీకు శాశ్వతానందం లభిస్తుంది" అని చెప్పేవాళ్లొకరకం. అరవిందయోగి వలె "సకలజీవరాశి పరిణామం చెందుతున్నది. మానవుడితో ఈ పరిణామక్రమం ఆగిపోలేదు. అధిమానవత్వాన్ని సంపాదించటమే మనకర్తవ్యం. ఆ దివ్యశక్తి నీలోకి అవతరించటానికి నువ్వు సంసిద్ధంగా వుండు." అని చెప్పేవాళ్లొకరకం.

కాని జనాభాలో ఎక్కువభాగానికి యీమాటలు అర్థంకావు. వాళ్ళ జీవితమంతా దైనికావసరాలని ఎదుర్కోటంతోనే సరిపోతుంది. తమ ఆర్థికదారిద్ర్యాన్నుంచి తప్పించుకోనటానికి ఆధ్యాత్మిక సంపదని సంపాదించటమే మార్గమని నమ్మేస్తారు. అందుచేతే మనదేశంలో సన్యాసులంటే ఇంత వేలంవెర్రి. ఉద్యోగం దొరికితే ఆంజనేయస్వామికి కొబ్బరికాయలు కొడతామని మొక్కుకునేవాళ్ల సంఖ్య ఎక్కువగా కనిపించటానికి కూడా ఇదే కారణం.

ఈ సందర్భంలోనే ముమ్మిడివరంబాలయోగి, నేపాల్‌బాబా రంగంలోకి అవతరిస్తారు. వీరివద్ద అలౌకికశక్తులున్నాయని విశ్వసించేవాళ్ళలో ఎక్కువమంది బీదవాళ్లే. మన ఆర్థిక హీనస్థితి కారణంగా దేశంలో క్షయ, కుష్టు మొదలైన భయంకర రోగాలు వ్యాప్తిలో వున్నాయి. వీటిని నిర్మూలించటానికి తగిన వైద్య సౌకర్యాలు మనకి లేవు. కొద్దిగాఉన్నా అవి ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉండవు. కనక "ఫలానాచోట ఫలానా యోగి వున్నాడట. ఆయన ఏ రోగాన్నయినా కుదిర్చేస్తాడట." అని చెవినిబడితే అక్కడికి జనం వేలకొద్దీ మూగడంలో ఆశ్చర్యంలేదు.

అయితే యీ యోగులచుట్టూ ధనికులు కూడా తరుచు చేరటం గమనిస్తాం. వాళ్లని గట్టిగా పరీక్షించి చూస్తే బ్లాక్‌మార్కెట్‌లాంటి నేరాలు చేస్తూ లోపల బాధపడేవాళ్లు కొందరుంటారు. ఆ యోగులమీద జవానికున్న వ్యామోహాన్నుంచి సొమ్ముచేసుకోదలిచేవాళ్లు మరికొందరుంటారు. పాలకవర్గంలోవాళ్ళు, పొలిటీషన్లు కూడా మనకి ఆ ప్రాంతాల్లో ఎదురుగా కనిపిస్తారు. ప్రజల్లో భగవద్భక్తిని ప్రోత్సహించటం వాళ్లకి లాభకరం. ఎందుకంటే అది ప్రజలసందేహాలని, విమర్శనాశక్తిని నిద్రబుచ్చుతుంది.

నేపాల్‌బాబా పదమూడేళ్ళ పసివాడు కావటం అతనిలోని ఆకర్షణకు మరో కారణం. వయస్సుమీరిన కపట సన్యాసులైతే లోకాన్ని తమవైపు కాకర్షించటానికి సొంతంగానే ప్రయత్నించగలరు. కాని ఇంత కుర్రవాడుగా, అమాయికంగా కనిపిస్తున్న గొల్లబాలుడిలో అలౌకికశక్తులున్నాయని భ్రమించటానికి ఆట్టేసేపు పట్టదు.

ఈ విషయాన్ని మొదటగా ప్రచారం చేసిందెవరో చెప్పటానికి మనకి ఆధారాలు లేవు. కాని ఎవరో పెద్దవాళ్లే అతని వెనకవుండి వ్యాపారం సాగిస్తూ వుండిఉండచ్చు.

ఏది ఏమైనా ప్రజలు నేపాలీబాబా దగ్గిరికి వేలకొలదిగా చేరారు. ఒరిస్సా, మధ్యప్రదేశ్, బీహార్, ఆంధ్ర మొదలైన అన్ని ప్రాంతాలనుంచి జనం వెళ్లారు. ఇంతమంది ఒక్కసారిగా ఆ గ్రామంమీద పడేటప్పటికి అవసరవస్తువుల కొరత ఏర్పడింది. ఇదే సమయమని బాబాని ఆశ్రయించుకునివున్న వర్తకులు ధరలు పెంచేశారు. నాలుగునెల్లకు పైగా యీతంతు జరుగుతున్నది. ఆహారపదార్థాల కొరతవల్ల, ధరలు పెరిగిపోవటంవల్ల జనం ఏది పడితే అది తినటం ప్రారంభించారు. పురుగులు పట్టిన అన్నమైనా, కుళ్లిన కాయగూరలైనా ఆకులు అలములు, ఏది దొరికితే అది తినేశారు గత్యంతరం లేక.

పైగా అక్కడికి చేరినవాళ్లు ఎక్కువగా రోగులు కావటంవల్ల ఒకళ్ళ రోగాలు ఒకళ్ళకి అంటుకున్నాయి. దుష్టమైన ఆహారం తింటే త్వరగా తగిలే జబ్బు కలరాయే. వెంటనే కలరా వ్యాపించింది. కొందరు ఉన్నచోటనుంచే ఈశ్వరుడిసన్నిధికి చేరుకున్నారు. కొందరు స్వస్థలాలకు తిరిగిపోతూ దోవలో అస్వస్థులై స్వర్గస్థులయ్యారు. మరికొందరు ఇళ్లకు చేరుకున్న తరువాత తమ కలరా ఇతర్లకి కూడా అంటించేదాకా మరణించలేదు. అందుచేత ఆచుట్టుపక్కల రాష్ట్రాలలో కలరా బాగా వ్యాప్తిలో వున్నట్టు వార్తలు తెలుపుతున్నాయి. మొత్తానికెల్లా లేదన్నా వివిధప్రదేశాల్లో 1500 మంది దాకా కలరావల్ల మరణించారని ధ్రువపడని అంచనాలు చెబుతున్నాయి. ఆ ప్రాంతంలో పర్యటించిన పి. టి. ఐ. వార్తావిలేఖరి రెండుమూడురోజుల్లో 500 మంది దాకా ఎక్కడపడితే అక్కడే టపటప కాకుల్లా రాలిపోయారని చెబుతున్నాడు.

నేపాల్‌బాబా ఇచ్చే మందులో ఔషధగుణమే లేదని కలకత్తాలో వైద్యులు దాన్ని పరీక్షచేసి తేల్చారు. ప్రఖ్యాతశాస్త్రజ్ఞులు సి. వి. రామన్ గారుకూడా ఈమాటే అన్నారు. అయినా కలరా బాగా వ్యాపించేదాకా ప్రభుత్వం తగిన జాగ్రత్తలు తీసుకోలేదు. ఆ తరవాత చాలా కట్టు దిట్టాలు చేశారు.

కలరావైద్యుల్ని చాలమందిని రంతలాయ్ ప్రాంతానికి పంపి కొన్ని తాత్కాలిక వైద్యశాలలు ఏర్పాటుచేశారు. ప్రతివాళ్ళకీ ఇంజక్షను లిచ్చి నివారణచర్యలు తీసుకున్నారు. రంతలాయ్‌దిశగా కొత్తగా వెళ్ళేవాళ్ళని ఆపుచేశారు. అక్కడ చేరిన యాత్రికులని త్వరత్వరగా స్వస్థలాలకి చేర్చివేశారు. ఇప్పుడు పరిస్థితి అదుపులోనే వున్నట్టు ప్రభుత్వం ప్రకటించింది.

కాని ఒక గుడ్డి కుర్రవాడు, వాడి తమ్ముడైన ఒక మూగవాడు మాత్రం ఇంకా రంతలాయ్‌లోనే మిగిలిపోయారు.

గ్రుడ్డివానిని మూగవాడు నేపాల్‌బాబా దగ్గిరికి తీసుకువెళ్లాడు.

గుడ్డి—మా అయ్యెక్కడుండాడు బాబా!

బాబా—మీ అయ్య చచ్చిపోయాడు.

గుడ్డి—అయ్యో! సచ్చిపోయాడా? ఇంక మా గతేంది దేముడా! (అన్నదమ్ములిద్దరూ ఏడుస్తారు)

బాబా—ఏడవకండి. మీ అయ్య చచ్చిపోలేదు. భగవంతుడిలో ఐక్యమయిపోయాడు.

గుడ్డి—ఏం బగమంతుడో బాబా! మీరిచ్చిన మందు పనిసెయ్యనేలేదండి. నాకు సూపూ రాలేదు. ఈడికి మాటా రాలేదు.

బాబా—మీ కర్మ ఇంకా పరిపక్వం కాలేదు. దానికి నేనేం చేస్తాను? దేవుణ్ణి స్మరించుకొంటూవుండండి. అందుకు మాటా చూపూ అక్కర్లేదు.

గుడ్డి—కడుపులో కాల్తావుందండి; దేముణ్ణి తలుచుకుంటే కూడెడతాడా బాబా? ఈడ మమ్మల్నెవరు కనికిరిత్తారు? మీరేదో మందిచ్చి రచ్చిస్తారని వొచ్చినాం. ఇప్పుడేడ బొయ్యేది మేం?

ఈలోగా పోలీసులువచ్చి బాబాయింటిని చుట్టుముట్టారు. ఆయనఇల్లంతా వెదికి "సర్వరోగనివారిణి"ని వశపర్చుకున్నారు. గుడ్డివాణ్ణి, మూగవాణ్ణి బయటికి పంపించారు. ఇప్పుడెవ్వరినీ బాబాదర్శనానికి రానివ్వటంలేదని వార్త.

ఆ గుడ్డి, మూగ అన్నదమ్ములు రంతలాయ్‌కి చేరిన యాత్రికులందరికీ ప్రతినిధులు.

—(ఎన్నార్.)



అర్కోణంలో యిటీవల జరిగిన సైనికుల ఆటలపోటీలను పరిశీలిస్తున్న మద్రాసుగవర్నరు భావనగర్ మహారాజాగారు.



ఆటలలో గెలుపొందినవారికి బహూకరించబడిన రజతపాత్రలు.

Regd No. M. 4479

# భారతి

## సచిత్ర మాసపత్రిక

**1951 జనవరి మొదలు భారతి చందారేట్లు దిగువరీతిని హెచ్చింపబడునని విన్నవించుచున్నాము.**

| | | |
|---|---|---|
| **సంవత్సర చందా** | .... | **రు. 12 లు** |
| **అర్ధ సంవత్సర చందా** | .... | **రు. 6 లు** |
| **విడి ప్రతి** | .... | **రు. 1 లు** |

శ్రేష్ఠమైన ఆర్టు పేపరుమీద త్రివర్ణ ముఖచిత్రముతోను, ఆర్టు ప్లేట్లతోను, సుప్రసిద్ధ రచయితల వ్యాసములతోను ఉత్తమ తరగతి పత్రికగ వెలువడుచుండిన 'భారతి', ప్రచురణ వ్యయ భారమును గమనించి చందా రేట్లు హెచ్చింపవలసిన అగత్యత బహుకాలముగ ఏర్పడి యుండియు నేటివరకు రేట్లు మార్చకుండగనే యుంటిమి. కాని రానురాను కాగితము ధర, సమస్తమైన తదితర ముద్రణవస్తు సామగ్రి ధరలు విపరీతముగా పెరిగిపోయినవి. ఇంకను పెరుగుచున్నవి. ఈ పరిస్థితిలో రేట్లు హెచ్చింపక తప్పనిసరి అయినది.

భాషాభిమానులైన ఆంధ్రమహాజనుల మన్ననచే 'భారతి' గత 25 సం॥ ల పైబడి నిరంతరాభివృద్ధినందుచు వచ్చినది. ఈ ఉత్తమ సాహితిపత్రిక ఇకముందునూ ఇదేరీతిని ఎల్లరి ఆదరాభిమాన పాత్రమై యుండగలదని విశ్వసించుచున్నాము.

చందాదారకు 1-1-1951 తేదీనాడు తమ లెక్కను జమయుండు మొత్తముమేరకు క్రొత్తరేట్ల ప్రకారము చందాగడువు సవరింపబడునని ఇందుమూలముగ తెలియపరుచుచున్నాము.

మేనేజరు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press. 7.ThambuChetty St. Madras